





వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాటిది.

# కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళ నాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

---



నృత్యకేళీవిలాసము




జయజయ గృహలక్ష్మీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతీమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# స్వచ్ఛందపద్ధతిపై మద్యనిషేధము

మద్యపాననిషేధ పథకమును సాంఘికచర్యగా స్వచ్ఛంద ప్రాతిపదికపై ప్రయోగాత్మకంగా విశాల హైదరాబాదులో ప్రథమంగా అమలు జరుగనున్నదని తెలుస్తున్నది. ఈ సందర్భమున మద్యనిషేధంను అమలు జరిపే బాధ్యతను జిల్లాపరిషత్తులకు పంచాయతిసమితులకు ఒప్పగించబడునట.

ఏచట్టమైనా తను సౌభాగ్యాని కుద్దేశించబడినదని ప్రజలుగుర్తించి దాని అమలుకు సహాకరించి, సహాయపడినచో చట్టపు ఆశయలక్ష్యాలు సిద్ధించగలవు. అట్టిది జరుగనినాడు చట్టముల ఆశయలక్ష్యాలు ఎంతటిమేలైనవైనా అవి సిద్ధించటం జరుగదు. అలాంటిదేమద్యపాన నిషేధంకూడా.

మనదేశంలోని పరిస్థితులు, వాతావరణము మద్యపానమును వరించునవి కావు. ప్రజలకు పుష్టికరమైన ఆహారములాంటి నిత్యావసరములకు లోటులేనిచో మద్యపానముమీద అభిలాషయుండదు. చేతినిండా పని, శ్రమకుతగిన ప్రతిఫలము అమరి, ఆప్రతిఫలమును స్వీయసౌభాగ్యమునకు వినియోగించుకునే అవకాశాలు లభిస్తే మద్యపానం చాలా పరిమితం కాగలదు.

జిల్లాపరిషత్తులు, పంచాయతీ సమితులు ప్రజాప్రాతినిధ్యసంస్థలగుటచే తమ పలుకుబడిని, చిత్తశుద్ధిని, అధికార అవకాశాలను వినియోగించి మద్యపాననిషేధ అవసరాలను ప్రచారంచేసి, ప్రజలను ఒప్పించి, మద్యపానాన్ని అరికట్టవచ్చును. ఇంతకాలం పోలీసురక్షణశాఖ సాధించలేని ఘనవిజయాలను జిల్లాపరిషత్తులు, పంచాయతీ సమితులు సాధించగలవనుటలో సందేహములేదు కాని, అందుకు ప్రజలసహాయ సహకారాలు అత్యవసరము. విశాలహైదరాబాద్‌లో ప్రప్రథమంగా అమలు జరుగనున్న యీ స్వచ్ఛంద పద్ధతి రాష్ట్రంమొత్తానికి, దేశానికికూడ ఉపయుక్తం కావాలి!

---

# విద్య — మానవత్వం.

విజ్ఞానంతో మానవత్వం బోధించే విద్య అవసరమని ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ ఉద్ఘాటించారు. అంటే యీ నాటివిద్యా విజ్ఞానాల పెంపుతో మానవత్వము నీరసించి, నైతిక స్థాయి సన్నగిలి రాక్షసత్వము ప్రబలుతున్నసూచనలు కనుపిస్తున్నవి.

మానవత్వం సమాజంలో నశించడం ఏవిధంగాను మంచిదికాదు. రాక్షసత్వము ప్రబలడం ప్రమాదవంతమని రుజువుచేయడానికి పురాణాలు, చరిత్ర ఆధారంగానున్నవి. కాబట్టి యీనాటి కల్లోలిత ప్రపంచమును రక్షించగలది నీతి, నిజాయితీలతోకూడిన మానవత్వము మాత్రమే కాబట్టి దానిని బోధించే విద్య, దానిని ప్రోత్సహించగల సంస్కరణలు యీనాటి అవసరం.



# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



శ్రు॥ తచ్ఛ్రోత్రేణా జిఘృక్షత్తన్నాశక్నో
చ్ఛ్రోత్రేణ గ్రహీతుం. సయద్ధైన
చ్ఛ్రోత్రేణా గ్రహైష్య చ్ఛ్రుత్వా
హైవాన్నమత్రప్స్యత్॥ (6).

[అతడు దానిని చెవులతో గ్రహించనెంచెను. చెవులతో దానినతడు గ్రహించలేకపోయెను. అతడు దానిని చెవులతో గ్రహించియుండినచో, మనము అన్నమును గురించి వినుటవలననే తృప్తిపొందగలిగి యుందుము.]

శ్రు॥ త త్వచా జిఘృక్షత్త న్నాశక్నో
త్వచాగ్రహీతుం. సయద్ధైన త్వచా
గ్రహైష్యత్ స్పృష్ట్వా హైవాన్న
మత్రప్స్యత్॥ (7).

[అతడు దానిని చర్మముద్వారా గ్రహించ బోయెను. స్పర్శవలన దానినతడు గ్రహించలేక పోయెను. అతడు చర్మమువలన దానిని గ్రహించ గలిగియుండినచో, మనము అన్నమును స్పర్శించుట వలననే తృప్తిపొందగలిగియుందుము.]

శ్రు॥ త న్మనసా జిఘృక్షత్త న్నాశక్నో
న్మనసా గ్రహీతుం. సయద్ధైన
న్మనసా గ్రహైష్య ద్ధ్యాత్వా
హైవాన్నమత్రప్స్యత్.॥ (8).

[అతడు దానిని మనసుతో గ్రహించనెంచెను. మనసుతో అతడు దానిని గ్రహించలేకపోయెను. అతడు మనసుతో గ్రహించగలిగియుండినచో, మనము అన్నమునుగూర్చి చింతించుటవలననే తృప్తిపొంద గలిగియుందుము.]

శ్రు॥ తచ్ఛిశ్నేనా జిఘృక్షత్తన్నాశక్నో
చ్ఛిశ్నేన గ్రహీతుం. సయద్ధైన
చ్ఛిశ్నేనాగ్రహైష్య ద్విసృజ్య హై
వాన్నమత్రప్స్యత్.॥ (9).

[అతడు దానిని శిశ్నముతో గ్రహించనెంచెను. శిశ్నములో అతడు దానిని గ్రహించలేకపోయెను. అతడు శిశ్నములో దానిని గ్రహించగలిగియుండినచో, మనము విసర్జనమువలననే తృప్తి పొందగలిగి యుందుము.]

పై మంత్రములలో, మానవునియందుగల వ్యవహారగుణములనెల్ల వర్ణింపబడియున్నది. ఇవన్నియు అన్నమును భుజించి తృప్తిపొందలేకున్నవి.

ఈశ్వరుడు అన్నమును సృష్టించెను. ఒక క్రూర మృగము బారినుండి కుందేలు తప్పించుకొని పరుగిడునట్లు, అన్నము తన స్వరక్షణార్థము పారిపోవుచుండెను. మానవునియందుండు వివిధ వ్యవహార గుణములు, అట్లు పరుగిడు అన్నమును వెన్నంటి భుజింప ప్రయత్నించెను. విరాట్పురుషునియందుండు వ్యవహారగుణములు, శక్తులు, వరుసక్రమముగ ఇచ్చట తెలుపబడియున్నవి. వాక్కు, ఘ్రాణము, నేత్రములు, చెవులు, చర్మము, మనసు, శిశ్నేంద్రియములు — అన్నమును భుజించ యత్నించెను. సాధ్యము కాలేదు. వాటికి అపజయము తప్పదాయెను. వాటిలో యొకటికూడ అన్నమువల్ల తృప్తిపొందగల స్వభావము లేకుండెను.

శబ్దమువలన చెవులు తృప్తిపొందునుగాని, ఇతర యింద్రియమేదియు తృప్తిపొందజాలదు. అదేవిధముగ, పైన తెలిపిన ఇంద్రియములేవిగాని, అన్నమును వశపరచుకొని, భుజించి, జీర్ణించుకొని, తృప్తిపొందగల శక్తి లేకున్నవి. ప్రతిదేవతకు గల శక్తి నిర్దిష్టమైయున్నది.

ప్రతియొక్కటి తన ప్రత్యేక ఇంద్రియ విషయమును మాత్రము అనుభవించగలిగియున్నది అని దీని సారము తెలియుచున్నది.

శ్రు॥ త దపానే నా జిఘృక్షీ త్తదావయత్. సైషోఽన్నస్య గ్రహో. యద్వా యు రన్నాయు ర్వా ఏష యద్వాయుః॥ (10).

[అపుడు అతడు తన అపానమువలన దానిని గ్రహించెను. అతడు జీర్ణించుకొనగలిగెను. కనుక అన్నమును అపానము మాత్రము గ్రహించగలిగియున్నది. మరియు అపానము (వాయువు) జీవితమును రక్షించు (అన్నాయువు) ముఖ్యకారణాంశముగ నున్నది.]

విరాట్పురుషుని నిర్ణయమున ఎనిమిది ఇంద్రియ శక్తులను వివరింపబడెను. ఆ ఎనిమిది శక్తులలో, ఏడు శక్తులు అన్నమును గ్రహించి, జీర్ణించుకొనగల శక్తి లేకున్నవి అని ఇచట నిరూపింపబడెను. ఈ మంత్రమున, ఎనిమిదవ శక్తియగు అపానము తన ప్రయత్నమున జయముపొందెనని తెలుపబడుచున్నది.

అపానమనగా, వాయువిసర్జనము. అధోముఖముగ పారు ఊపిరి. జీర్ణకోశమున ప్రేగులు అధోముఖముగ కదలుచు మెదలుచు నుండును. ప్రేగులట్లు కదలుచుండుటవలన భుజించిన అన్నము అధోముఖముగ జరిగిపోవుచు జీర్ణింపబడును. జీర్ణకోశమున ఇట్టి అధోముఖచలనము ముఖ్యవ్యవహారశక్తిగ నున్నది. మనము మ్రింగిన ఆహారము వెనుకకు మరలివచ్చుటలేదు. ముందుకు వెళ్లుచు జీర్ణింపబడుచున్నది. అందువలన అపానము అన్నగ్రహము, అన్నమును గ్రహించుచున్నది. జీర్ణించుచున్నది. మలమును విసర్జించుచున్నది. ఇట్లు జీర్ణింపబడిన ఆహారమువలన, దేహనిర్మాణము, రక్షణ కలుగుచున్నది. విషయేంద్రియములు చురుకుగను, శక్తివంతముగను, వ్యవహరింపగలుగుచున్నవి. ఈ విషయమున సందేహముండువారు, ప్రయత్నమువలన 41 రోజులు కొద్దిజలమును మాత్రము పుచ్చుకొనుచు, ఆహారము లేక ఉపవసించినచో, తెలియగలదు. ఈ మాంసమయ దేహమును 20 రోజులు ఆహారములేక జేసినచో, మనిషియొక్క శరీర మనో బుద్ధుల వ్యవహారములు సన్నగిలి అర్ధశక్తికూడ మిగిలియుండదు.

అపానము అన్నమును గ్రహించుచున్నది. నిలుపుకొనుచున్నది. జీర్ణించుచున్నది. దేహమునకు పుష్టినిచ్చుచున్నది. మలములను విసర్జించుచున్నది. కనుక దీనిని అన్నాయువు అనబడును. అట్టి అపానమును ఇచ్చట వాయువు అని తెలుపబడుచున్నది.

శ్రు॥ స ఈక్షత కథం న్విదం మ దృతే స్యా దితి. స ఈక్షత కతరేణ ప్రపద్యా ఇతి. స ఈక్షత యది వాచా భివ్యాహృతం, యది ఘ్రాణే నాభిఘ్రాణితం, యది చక్షుషా దృష్టం. యది శ్రోత్రేణ శ్రుతం యది త్వచా స్పృష్టం యది మనసా ధ్యాతంయ ద్యపానే నాభ్యపానితం యది శిశ్నేన విసృష్ట మథ కోఽహ మితి.॥ (11).

[సృష్టికర్త లేక ఇవెల్ల ఎట్లుండగలవని అతనికి సంశయము కలిగెను. అందువలన అతడిట్లు చింతించసాగెను. "ఇరుమార్గములలో దేనిద్వారా నేను ప్రవేశింపగలను. మరియు ముఖమువలన వాక్కు కలుగుచుండిన, నాసికవలన ఘ్రాణము, నేత్రమువలన దృష్టి, చెవులవలన శ్రవణము, చర్మమువలన స్పర్శ, మనసువలన ఆలోచనలు, అపానమువలన భోజనము, శిశ్నేంద్రియమువలన విసర్జనలు - కలుగుచుండినచో ఇక నేనెవడను ?"]

కతరేణ _ రెంటియందే మార్గమున _ అతడు (సృష్టికర్త) తాను సృష్టించి సమానావకాశమును, యేద్వారమున ప్రవేశించవలెను అని విచారించసాగెను. ఒక కోటకు రెండు ద్వారములున్నవి. వాటిలో ఏ ద్వారమును కోరవలెను అనుటలో సందేహము కలిగెను. వేదమునందీ అరణ్యకమున, పూర్వప్రశంస కొంతకలదు. అందు మానవుని పాదము యొక్క చివరిభాగము ద్వారా, ప్రాణము శరీరమును ప్రవేశించెననియున్నది. శరీరమునందు పలువిధవ్యవహారములందు ప్రకటితమగు ఆత్మశక్తిని ప్రాణమని చెప్పబడును. కనుక ప్రాణమనిన, ఆత్మశక్తియనిన యొకటే. ఆత్మశక్తి ప్రాణముగ ప్రకాశించుచున్నది.

(Physics) వస్తుపరిశోధన శాస్త్రమందు దీని నుదాహరము కలదు. ప్రకాశము, ఉష్ణము అను రెండుశక్తులు గలవు. ఒక మైనపువత్తిని వెలిగించి

నచో, దానివలన ప్రకాశము కలుగుచున్నది. ఆ దీపశిఖను ముట్టిచూచిన ఉష్ణము తెలయుచున్నది. ఈ ప్రకాశము ఉష్ణము రెండును ఒక దీపశక్తియొక్క గుణములుగా నున్నవి.

అదేవిధముగ, విచారణాసౌకర్యమునకై, శరీరమునందుగల జీవితవ్యవహార శక్తులను రెండు విధములుగ ఈ ఋషి విభజించియున్నాడు. శరీరమున, వ్యవహారరూపమున ప్రకటితమగునది క్రియాశక్తి. జీవిత వ్యవహారములకన్న, సూక్ష్మముగ, అంతర్యామియై యుండునది జ్ఞానశక్తి – ఎఱుక – ఆత్మ.

ఐతరేయారణ్యమున, దేహమునందు, పాదాంగుష్ట చివరిభాగముద్వార ప్రాణము ప్రవేశించెనని తెలిపియుండుటవలన, ఇచ్చట, ఏ ద్వారమున తాను శరీరమును ప్రవేశించవలెనని పరమాత్మ ఆలోచించుచున్నాడని తెలుపబడుచున్నది. ఒక కోటను వశపర్చుకొనినపుడు, సైనికులు, నాయకులు, కోటకుగల పలువిధ ఛిద్రద్వారముల ద్వారా, ప్రవేశించగలరు. కాని, ఆ సైనికులను పురిగొల్పిన రాజు, మర్యాదపూర్వక ఉత్సవముతో కోటను ప్రవేశించును. అతనికి ఛిద్ర ద్వారములు తగవు. జయోత్సాహమున సైనికులు, పలువిధ ద్వారముల ద్వారా ప్రవేశించినను, రాజు ప్రవేశించుటకు అవి ఉపయోగపడవు. అతడు గొప్ప ముఖద్వారమున ప్రవేశించును.

అదేవిధముగ, ఈ దేహమనబడు కోటను, ప్రాణము పాదముయొక్క చివరిభాగమున ప్రవేశించియుండుటవలన, రాజగు ఆత్మకు ఆ ద్వారము తగియుండదు. దానికన్న ముఖ్యము, గౌరవముగల ద్వారమున ప్రవేశించవలెను. క్రియాశక్తులకు ఇంద్రియ వ్యవహారములు నీచద్వారములలో శరీరమును ప్రవేశించెను. జ్ఞానశక్తి శరీరమును ప్రవేశించుటకు పవిత్రమైన ద్వారము, ముఖ్యమైన ద్వారమును కోరెనను విషయము గ్రహించవలెనని గురువుల తాత్పర్యము.

జ్ఞానేంద్రియముల, కర్మేంద్రియముల నిర్మాణము జరిగెను. వీటికిగల ప్రత్యేకశక్తులు వాటికి సమకూడెను వీటి పోషణార్థము వీటికి వలయు అన్నము సృష్టింపబడెను. అవి తమతమ ఆహారముల భుజించుటకు తమతమ వ్యవహార రంగములందు నియమింపబడినవి. ఈరీతి ఇంద్రియములకు వలసిన విషయములు, విషయముల ననుభవించు ఇంద్రియముల నిర్మాణమాయెను. కనుక సృష్టిక్రమము పూర్తియాయెను.

అయినను, ఈ సృష్టిపూర్ణత్వము, రోగులులేని వైద్యశాలవలె, విద్యార్థులులేని పాఠశాలవలె, యజమానిలేని గృహమువలె, కర్త లోపించిన వాక్యమువలె నున్నది. కథానాయకుని ప్రశంసలేని నవల, కేవలం చిత్తుకాగితముల సంపుటమువలె నుండును. నవలయందు వర్ణింపబడిన వ్యవహార విషయములన్నిల యొక సూత్రమున గ్రుచ్చినచో, సమాజమున జరుగుచుండు వ్యవహారముల దృశ్యము ఒకవైపు ప్రకాశమగును.

అదేవిధముగ, ఇంద్రియ కరణములు సృష్టి పొందెను. బలము, చురుకుదనము కలిగియున్నవి. చక్కని పోషణ చేకూరినవి. వివిధరూప సౌందర్యములతో కూడిన ప్రపంచవిషయములు వాటి అందుబాటున యున్నవి. అయినను, "నేనులేక, ఇవి ఎట్లుండగలవు?" అని సృష్టికర్త తలచుచున్నాడు.

ఇన్ని విధములగు శక్తులు, స్పర్శలు, వ్యవహారములు కూడియున్నను, అవి వాటి వాటి ప్రత్యేక స్పర్శలవలన విషయములను తెలుసుకొనుచు, తమతమ రంగమున వ్యవహరించుచున్నను, వాటి అన్నిటి అనుభవములు, పూర్ణజ్ఞానమును కలిగించలేకున్నవి. ఉదాహరణమునకు ఒకవ్యక్తి, ఒక అడవిలో ప్రవేశించెను. అచ్చటనుండు రాళ్లు, గుండ్లు ఘనముగ నున్నవని, ఎండ వేడిగ నున్నదని, అతని చర్మము అతనికి తెలుపుచున్నది. అతడు పోవుచుండగా, దూరమున యొకవస్తువు కనబడెను. నాలుగడుగుల ఎత్తున్నది. దానివర్ణము పసుపుపచ్చగ నున్నది. మధ్య నల్లని చారలున్నవి. అది గర్జించుట చెవులు తెలుపుచున్నవి. దానినుండి దుర్గంధము వచ్చుచున్నదని నాసిక తెలుపుచున్నది. దాని కాళ్ళయందు వాడిగల గోళ్లున్నవని కండ్లు తెలుపుచున్నవి. ఇన్ని భావములు, కేంద్రీకరించి, ఏకకాలమున, అతని స్పృహకు తెలియకపోయినచో, అదియొక చారలుగల దుష్ట మృగము, గర్జించుచు, తనవైపు వచ్చుచున్నది. అది యొక వ్యాఘ్రము. దానితో చర్లాటము మానవ జన్మమునకు ప్రమాదకరము. కనుక, తన కాళ్లకు బుద్ధి చెప్పి, ఆ పెద్దపులి బారినుండి రక్షించుకొనవలెనను స్పృహ కలుగదు.

నేత్రములవలన, నాసికవలన, కర్ణములవలన, స్పర్శవలన, కలుగు వివిధ అనుభవములను కేంద్రీకరించి తెలుసుకొను జ్ఞానాంశ మొకటియుండిన, అనుభవములు పూర్తియగుచున్నవి. ఈ కరణములకెల్ల యజమానుడొకడు లేకున్న, వీటి అనుభవములు వ్యర్థమగును.

(సశేషము)

# సంక్రాంతి ముగ్గులు

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

భోగి పండుగ నాటికే యేగు దెంతు
ననుచు నమ్మకముగ బల్కినట్టి మగడు
రాని కారణమేమంచు రాత్రి నిదుర
లేక వేకువ జామున లేచె నొకతె

చాల కాలంబు దూర దేశాల నుండి
పండుగకు నాడె వచ్చిన ప్రాణ నాథు
దృఢ పరిష్వంగ సౌఖ్యాల దేలి పోయి
లేచె వేకువ జామున లేమ యొకతె.

అలక పాన్పున తనభర్త అడిగినట్టి
''రేడియో'' నెట్టులో సేకరించి నట్టి
తల్లి దండ్రుల ప్రేమను దలచికొనుచు
వడి వడిగ లేచె వేకువఁ బడతి యొకతె

సమవయస్కులు పెండ్లియై చాల దినము
లత్త వారిండ్ల నుండి నాడరుగు దేర
నా యదృష్టంబు తన కెప్పుడో యటంచు
మున్నె లేచెను వేకువఁ గన్నె యొకతె

అక్కయును బావయును వచ్చిరంచు అమ్మ
మురిసి పనుల భారమ్మున మునిగి పోవ
చేతనైనంత సాయమ్ము చేయదలచి
చలిని లెక్కింపకయె లేచె లలన యొకతె.

ఆ తెలవారు జామున నొయ్యారము మీరగ లేచిగోమయో
పేత జలమ్ము వాకిళుల బిత్తరు లంతట చల్లి రంగ వ
ల్లీతతిఁ దీర్చి దిద్దరతి హృద్యముగా, తిలకించువారికిం
బ్రీతిగ; నూత్న శోభ చిగురింపగ సర్వగృహాంగణమ్ములన్
ఎక్కడ తప్పునో యని యొకించుక ఏమరుపాటు లేక యే
చుక్కలు లెక్కపెట్టుకొను చుండుగ శ్రద్ధగ గల్పుచుండ నే
దిక్కున నుండి వచ్చెనో అదే పనిగా తిలకించి భర్త '' ఓ
చక్కదనాల చుక్క ! '' యన జవ్వని సిగ్గున నాపెముగ్గులన్

ఎందుకు మంచులోఁదడిసి యింతటి ముగ్గులు పెట్ట బూనెదో
సుందరి! కండ్లు కాయలుగ జూచెదు నీ పతి నీదురాకకై ;
ముందుగ బోయి యాతనికి ముద్దు మొగమ్మును జూపుమంచు ప
ల్కుండదన ముగ్గు వీడి వడిగా నరుదెంచెనవోడ లోనికిన్.

ఇంతశ్రమించి ముగ్గుల రచింతు విదేమొ ఉయాలయంచు నీ
మంతపు పెండ్లి కూతుఁగని మాటికి పల్కెడు నాదు బిడ్డతో
కొంత స్వతంత్ర భావమునఁ గోమలి యిట్లను "అన్నగారి రో
జంతయు నిద్రపుచ్చి తమ రన్నిటఁ బెద్దరికాలు సేయగన్"

పెద్దల సాంప్రదాయము నుపేక్ష యొనర్పక పెక్కు ద్వారముల్
దిద్దుచు నున్న కన్య నలరించిరి మేలములాడి వావియా
ముద్దియ లెల్లరిట్లనుచు "ముద్దిల పెండ్లి కుమారుడల్ల దే
యిద్దార సాని పాణిగ్రహింపక ద్వారము దూరి వచ్చెదున్"



# ఆర్తుడు

"యమ్మ్రసావ్"



కాల సూర్యుని కాంతి
నేలపై సోకింది
నక్షత్రకాంతులు
నశించి పోయేవి

పక్షుల కిచకిచలు
పెద్దగా ఉన్నాయి
నీటిలోకలువలు
నీలిముసుగులు దాల్చె

ప్రక్కనే తామరలు
ప్రజ్వరిల్లుచు నుండె
జలారి చేపలకు
గేలాలు వేసేడు

ఆలమందల తోటి
ఆరుపులరచుచును
ఊరు బయటకు వెడలె
పశుల కాపరులు

రచ్చబండకు ప్రక్క
రోగిష్టి యొక్కడు
రాగాలు పాడుచు
నేలపై బడియుండె

ఎంచి చూచినవారి
కాతనిదినచర్య
అది వింతగా తోచు
పాపమటు చూడు

ఇసుకయే పరుపట
వెన్నెలే వెలుగుట
చెట్టు నీడేకదా
అతని ఇల్లంటాడు

చలిబాధ పడతాడు
ఎండకోరుస్తాడు
చింకిచెరగే పరచి
చక్కగా నిద్రిస్తాడు

కడుపుకోరకే కదా
తిరువీధి తిరుగతడు
కడుపు కోరకే కదా
తిట్లెన్నో తింటాడు

దయ చూపు దయచూపు
అతనిపై దయ చూపు
మనమంత మిత్రులం
మనమంత సోదరులం

# త్రాగుబోతు

జర్మను మూలం :
హాన్స్ ఫల్లాడా

ఆంధ్రానుసరణ :
డాక్టరు వి. ఎన్. శర్మ



## ఇంతవరకు సాగినకథ

[త్రాగుబోతు స్వభావరీత్యా త్రాగుబోతు కాడు. ఆ ప్రాంతాల్లో పేరు ప్రతిష్ఠలతో పెద్ద వ్యాపారసంస్థని నడుపుతూవున్న వర్తకుడు. పేరు సోమర్. భార్య పేరు మాగ్దా! ఇద్దరూ కలిసి ఈ సంస్థను జయప్రదంగా నడుపుతూవున్నారు. ఒకరోజున వాళ్ళ ఇంట్లో ముసలం పుట్టింది. అది సోమర్ చేత చేయించాలసిన పనులని తూచ. తప్పకుండా చేయించింది. దాంతో భార్యాభర్తల మధ్య పేచీలు. భర్త త్రాగటానికి అలవాటు పడిపోయాడు. దాంతో నలుగురి ముందర భార్యని అవమానపరచి ఆ వూళ్ళోనుంచి పారిపోవాలసిన దుర్భరావస్థకి లోనుగావాలసి వచ్చింది. ఇప్పుడు అతని మకాం ప్రక్కవూళ్ళో లోబెడాన్స అనే ఆయన ఇంట్లో. అద్దెకోసం, త్రాగుడుకోసం సోమర్ తన దగ్గరవున్న వస్తువులని తాకట్టు పెట్టాడు. అవి చాలాయి కావు. — ఇంక చదవండి.]

## I

పరాయిచోట్లల్లో, ముఖ్యంగా పరాయివాళ్ల ఇండ్లల్లో చీకూచింతా లేకుండా కాలక్షేపం చేయటానికి పుష్కలంగా డబ్బు వుండాలి. ప్రతిరోజూ భోజనమజ్జనాదులకు ఖర్చు ఎంతో అవుతూవుంటుంది. నావంటివాళ్లకి అలాటి పరిస్థితుల్లో ఎంత ఖర్చు అవుతుందో బాగా వూహించుకోవచ్చుగా!

లోబెడాన్స ఇంట్లో తిష్ఠవేయటానికి ప్రారంభించిన మొదటివారంలోనే ఆ ఖర్చులక్రింద, ఈ ఖర్చులక్రింద, ఇంతవరకు నా ప్రాణంమల్లె చూసుకుంటూవున్న రెండు బంగారు వుంగరాలని ఆ పెద్దమనిషి చేతికి ఇయ్యాల్సివచ్చింది. దాంతో అతను పూరకున్నాడా! దానికెంత అయిందని దీనికి ఇంత అయిందని పెద్దబిల్లుని తయారుచేసి నా బంగారు గడియారాన్ని కాజేశాడు. లోలుపంచిని కూడా గుటకాయిస్వాహా చేశాడు. ఇంతకూ నా వస్తువులని తాకట్టుక్రింద తీసుకుంటూ డబ్బుని ఇస్తూవున్న దుకాణపు మనిషి ఎవడైనా వున్నాడా, లేక ఆ మనిషిపేరు చెప్పుకుంటూ ఈ ఇంటిమనిషి లోబెడాన్సే ఈ నాటకాన్ని ఆడుతున్నాడా? ఈ మనిషీ వాలకం చూస్తూవుంటే, ఇలాటి అనుమానం తట్టడంలో ఆశ్చర్యం వుండదు. కాని ఏం చేయగలుగుతాను?

ఆ వారంరోజుల్లో అంత జబ్బులో ఆ పెద్దమనిషి నాకు తెచ్చి ఇచ్చిన బుడ్లు ఒక డజనుకు పైగా వుండవు. మార్కెట్లో బుడ్లవెల ఎక్కువయిందంటూ బుడ్డికి నాలుగు మార్కులు (నాలుగున్నర రూపాయలు) వంతున లెక్కకట్టాడు. లోపలి సరుకు ఎంతో అధ్వాన్నమైంది. మార్కెట్కన్నా ఎక్కువవెల వుండదు. అయినా ఆ పెద్దమనిషి చెప్పిన దానికి తలఒగ్గటంకన్నా మరే గత్యంతరం వుంది? భోజనంకేసి చూసినవాడ్ని కాను? కాఫీ తయారుచేసి తెచ్చి ఇచ్చానని, చాలా దూరంలోనున్న

(43వ-పేజీ చూడుడు)

# కన్నీటి కెరటాలు

శ్రీమతి పఠానేని శ్రీశైలభ్రమరాంబ

(గతసంచిక తరువాయి)

జగన్మోహన్ అభివృద్ధికిరావాలంటే తనువాని కంటికికూడా కన్పించకూడదు. తను వెళ్లిపోయి తన బిడ్డని అతనికి మిగిల్చినా అతని శేషజీవితమంతా ఈ బిడ్డతోనే గడుపుకొని నిస్వార్థంతో బ్రహ్మచర్యా శ్రమంలోనే జీవితమంతా గడుపుతాడు. తనదృష్టిలో రెండేళ్లలోపు మురళి కడుపునకన్న బిడ్డ; ఇరవైఏళ్లు దాటిన జగన్మోహన్ కళ్లనకన్న బిడ్డ. ఇద్దరూ తనకు పుత్రులే. రెండు నేత్రాల్లా భావించుకుంటోంది. అందు చేత జగన్మోహన్ శ్రేయస్సుకోసం తనిక్కడనుంచి దూరంగా తప్పిపోవాలనే నిశ్చయానికి వచ్చింది విశాలాక్షి,

మురళీని చంకను ఎత్తుకుని గుమ్మంలం దిగబోతోంటే జగన్మోహన్ ఎదురయ్యాడు. "అమ్మా! ఎక్కడికమ్మా యీ ప్రయాణం?" అంటూ దీనంగా అడిగాడు.

"అన్నా అన్నా" అంటూ చంకలోని మురళి గభీమని అతనిపైకి ఉరికాడు.

"అమ్మా! అన్నదమ్ములమైన మమ్మల్ని వేరుచేసి ఈ బుల్లితమ్ముణ్ణి తీసుకుపోతావా అమ్మా! నీ రెండు నేత్రాల్లోనూ నీ నీడన మెలగుతున్న మాయందు ఆగ్రహిస్తావా అమ్మా!" అంటూ పసివానిలా భోరున విలపించాడు —

"నాయనా! జగన్మోహన్! అమ్మనైన నన్ను గౌరవించే వాడవైతే నేను చెప్పినట్లు చేస్తావా?" అంది —

"అమ్మా! నువ్వు నాదగ్గరనుంచి వెళ్లిపోకుండా వుంటే ఏమిచెయ్యమంటే అది చేస్తానమ్మా!"

"అయితే వెంటనే నువ్వు పెళ్లి చేసుకుని భార్యతో సహా కాపురం పెట్టుకో. నీ జీవితనావకి చుక్కాని వంటిభార్యలేకపోతే నీ బ్రతుకు సవ్యమైన బాటలో నడవడంకష్టమైపోతుంది"

"అమ్మా! ఉద్యోగమనే ఆస్కారంలేకుండా ..." "విద్యావంతుడవు. నీకింక ఉద్యోగానికై ఏమీ శ్రమలేకుండానే దొరుకుతుంది. నీకు నచ్చిన అమ్మాయిని స్వీకరించి హాయిగా జీవయాత్ర సాగించుకో"

"త్వరలోనే నీ యాజ్ఞ నెరవేరుస్తానమ్మా!"

"అలాకాదు- వెంటనే వెళ్లి వధువుకోసం అన్వేషణసాగించి భార్యతో సహా ఇక్కడికిరా"

"అదేమిటమ్మా! యింత కఠోరమైన ఆజ్ఞయిస్తే ..."

"నీ తల్లి జీవించివుండాలంటే నీ తమ్ముని భవిష్యత్ బాగుండాలంటే; నువ్వు భార్య సమేతంగా నాకు కన్పించాలి! లేని పక్షంలో నీ మాతృమూర్తి అంతరించి పోతుందని గుర్తుంచుకో —"

"అల్లాగేనమ్మా! ఈ అజ్ఞ శిరసావహించి నీ కోడలితో సహా ఇక్కడికొస్తా. అమ్మా! ఇదే నీ పాదాలమీద ఆన. ఈ క్షణంనుంచి అన్వేషణసాగించి కల్యాణంకాగానే నీ ఆశీస్సులకోసం వస్తానమ్మ. తమ్మునితోసహా జాగ్రత్తగా ఇంక్కడేవుండు" అంటూ ఆమెపాదాలను కళ్ళకద్దుకుని నమస్కరించి నిష్క్రమించాడు జగన్మోహన్

♦ ♦ ♦

విశాలాక్షికి ఇల్లాంటి అపనిందలు భరిస్తూ క్షణమైనా అక్కడ నిల్చుండలేకపోయింది. అజ్ఞాతంగా ఎక్కడో ఒకచోట తనకొడుకుని పెంచిపెద్ద చెయ్యాలని మనస్సా నిశ్చయానికి వచ్చింది.

తన బిడ్డకోశం విశాలాక్షి ఒక కుగ్రామంలో ప్రయివేట్లుచెప్పే పంతులమ్మగామారింది. ఒక పాతికమంది చిన్నపిల్లలకు అక్షరాలు దిద్దుస్తూ, చిన్నచిన్న పాఠాలు చెబుతూ అయిదులోపు తరగతుల బాల బాలికల్ని చేరదీసి వారికితల్లిగా, గురువుగా ఆదరిస్తూ

మురళితో జీవయాత్ర చేస్తోంది. తన్నుగ్రామంలో వారంతా తనని సోదరిలా, తల్లిలా, బిడ్డలా ఆ బాలగోపాలం తనని ఎంతో ఆదరాభిమానాలతో చూస్తున్నారు. తనే పవిత్రక్షణంలో ఆ వూళ్లో కాలు పెట్టిందో కాని తననిచూస్తేచాలు; "అమ్మగారూ! అంటూ ప్రతీపిల్లలూ పలకా పుల్లాతీసుకు తనదగ్గరకు పరుగెత్తుకువస్తున్నారు. బ్రతికింది ఊరూ; మానిందుమందూ ; అన్నట్లు గౌరవంగా అజ్ఞాతంగా ఆ ఊళ్లోతను ఏడు సంవత్సరాలనుంచీ కాలం గడిపింది. అంతర్యంలో తనకెంత దుఃఖంవున్నా పైకి గంభీరంగావుంటూ అహోరాత్రులు పతినామస్మరణతో దైవ చింతతో సత్కాలక్షేపం చేసుకొంటోంది. తనని "అమ్మా! అని పిలుస్తూ వందలాది పిల్లలు తనచుట్టూ వుంటూంటే ఆమెలోని మాతృప్రేమవాహిని పొంగిపొరలేది" అకాత్తుగా ఈ రోజున "ట్యూటోరియల్ స్కూలు"వారినుంచి తనభర్తకు జబ్బుగావున్నట్లు టెలిగ్రాంవచ్చేసరికి మొదలు నరికిన కదలీ తరువులా కూలిపోయింది. తను ఈ ఏడుసంవత్సరాలనుంచీ తనజీవిత విషయాలు గురించికాని, చివరకు తనభర్తసంగతికూడా ఎవ్వరికీ చెప్పలేదు. ఎవరైనా గుచ్చిగుచ్చి అడుగుతే తనో అభాగ్యురాలననీ, కన్నీటికెరటాలిమీద తన జీవిత నావను నడిపించుకొంటూ మురళిని ఒకయింటివానిగా చేసేవరకూ తనుజీవించదల్చుకొన్నట్లుమాత్రం చెప్పేది. అంతకుమించి తననిగురించి ఆఊళ్లో ఎవ్వరికీ తెలీదు. తన సద్గుణ సంపత్తితో వారినందరినీ ఆకర్షించి ఆ గ్రామవాసులందరి హృదయాల్లోనూ స్థిరంగా హత్తుకుపోయింది.

అందుకే ఎవ్వరికీ టెలిగ్రాం సంగతి వివరంగా చెప్పలేక అర్జంటుగా, గ్రామాంతరం వెళ్లాలని కొడుకుతోసహా బయల్దేరింది.

"అమ్మా! ఇంకా ఎంతదూరం వెళ్ళాలమ్మా?" అన్న కొడుకు పిలుపుతో గతంనుంచి భావికివచ్చింది.

"ఊళ్లోకివచ్చాంబాబూ!" అంటూ అట్యూటోరియల్ స్కూల్ ప్రాకారాన్ని పరీక్షిస్తూ గత స్మృతులనుంచి వర్తమానంలోకివచ్చి అడుగులు గబగబా వేస్తోంది విశాలాక్షి

సరిగ్గా కోనేటి దగ్గరకొచ్చింది కొడుకుతో సహా విశాలాక్షి. మనస్సును పాషాణంచేసుకుని ఆ పరిసరాలన్నీ పరికించి చూస్తోంది తనూ తనభర్త అక్కడికి ఎన్నోసార్లు షికారుకొచ్చేవారు. ఆ రోజుల్లో బోర్డువారి గుడ్డిదీపాలువుండేవి. కాని ఇప్పుడు అర్ధరాత్రినికూడా పట్టపగలుగా కన్పించేటట్లున్న ఎలక్ట్రిక్ దీపకాంతిలో ఊరంతా కన్పిస్తోంది. ఏడేళ్ళలో ఎంత మార్పువచ్చిందో అనుకుంది–

కోనేటిలో తన కొడుక్కి కాళ్లు, బురదకడగాలను కొనిదిగింది. ఆకోనేటికి చుట్టూ యినపచువ్వలతో పశువులకు ప్రమాదంరాకుండా ఎంతోకట్టుదిట్టం చేసి పావంచాలుకట్టి మంచిసదుపాయం చేసారు కాబోలు అనుకొంటూ కొడుక్కి బురదను శుభ్రంగా కడిగి బట్టలుమార్చింది. తనకిమాత్రం కాళ్లుకడుక్కోవాలన్న జిజ్ఞాసకూడా లేకుండా ఆతృతగా మురళిని తీసుకుని తమవీధులోకి వచ్చింది.

◆ ◆ ◆

జగన్మోహన్ తనవాగ్దానం ప్రకారం తనకన్నివిధాలా మనస్సుకినచ్చిన యువతిని ఎంచుకున్నాడు. తన తల్లిజీవించి ఉన్నప్పుడే తనకోసం ఎందరో కన్యల్ని ప్రత్యేకంగా చూపించింది. వారిలో రాధ అనేయువతి అందంలో, గుణంలో అన్నింటా తనని మించింది. ఆమెనే అగ్నిసాక్షిగా స్వీకరించి "అమ్మ" దగ్గర ఆశీస్సులకై రాధతోసహా వచ్చాడు –

ఆ యింట్లో ఉన్న ఒకామె తాళంచెవి తీసుకొచ్చి యిస్తూ "ఆవిడమీరు వెళ్లిన వెంటనే వెళ్లిపోయింది. మీరు వస్తే ఇవి మీకిమ్మని చెప్పింది" అంటూ అందించింది.

"ఎక్కడకు వెడతానన్నారో కొంచెమైనా చెప్పారా?" అన్నాడు అమాయికంగా జగన్మోహన్.

"ఏమిటో! నాయనా! అల్లాంటివాళ్ళకి ఒక చోటేమిటి? మీరు పెళ్లిచేసుకుంటారని తెల్సింది కాబోలు; మరొకరి సొత్తిమీదో చెయ్యిపెట్టడానికి వెళ్లండి. ఆవిణ్ణి మర్చిపోయి హాయిగా కాపురంచేసుకోండి" అంటూ ఒక వృద్ధసువాసిని ఉపదేశించింది.

ఆవార్తలనందించే వ్యక్తులు ఒక్కొక్కరే తనకీ రాధకీ లోపలికి ఆహ్వానంయిస్తోంటే, తన, నరనరాన్ని కణకణాన్నీ చిత్రవధచేసేస్తున్నట్లు, వాడి కత్తులు పుచ్చుకుని నిల్చున్నట్లుగా కన్పించారు. నిస్పృహతో భయంతో నిరాశతో నట్టనడి సముద్రంలోని నావే అయిపోయాడు జగన్మోహన్ –

రాధతోసహా లోపలప్రవేశించాడేకాని, జీవితానంతరం, దాటాల్సిన వైతరణీనది ఇప్పుడే తనకాళ్ళ

ముందే వున్నట్లనిపించింది ఆతనికి. విశాలాక్షిని గురించి ఆద్యంతాలన్నీ రాధతో చెప్పమని పసివానిలా బావురుమన్నాడు జగన్మోహన్.

“రాధా! అపవాదులతో గుండెలు తూట్లు తూట్లుపడిపోయినా చివరకు నాతల్లివిశాలాక్షిని కూడా దక్కించుకోలేకపోయా!” అంటూ విలపించే భర్తను దగ్గరగా తీసుకుధైర్యంచెప్పింది. ఆతనిబాధను చూస్తూంటే రాధగుండెలు చెరువైపోతున్నాయి. ఆమె మనస్సు భయంతో కుతకుతలాడిపోతోంది. విశాలాక్షి కన్పించకపోతే తనభర్త పిచ్చివాడై పోతాడేమోననికూడా ఆమె హృదయంలో క్షోభిస్తోంది. “జీవితంలో చెలగాటాలాడ్డం చాలా ప్రమాదం. ప్రతిక్షణం ఎంతో మెలకువతో, దూరదృష్టితో మసలుకునే వారికే కష్టాలుతప్పవు. అలాంటిది ఒక్క అమాయిక అబల పసిబిడ్డతో ఎక్కడ వుందో; ఎలాజీవిస్తోందో_అసలేమైందో! రాధా! ఆమెకష్టాలకన్నింటికీ కారకుణ్ణినేనే! నాపాపానికి ప్రాయశ్చిత్తంలేదు.” అన్నాడు రాధగుండెల్లో తలనుపెట్టి జగన్మోహన్ –

“మీరేం విచారించకండి. లోకంగుడ్డిది_లోకులు కాకులే. మాతాశిశువుల, సోదరీ, సోదరుల పవిత్ర ప్రేమనుకూడా కళంకం ఆపాదించే ఈ నీచలోకపు కాకుల అపనిందలకి మనస్సులు దహించుకుపోయి ఎందరి అమాయిక జీవితాలు అంతమై పోతున్నాయో! ముందుగా విశాలక్షి ఎక్కడవుందో తెల్సుకుని ఆ పైన అన్నివిధాలా ప్రయత్నాలుచేసి ఆమెను పునర్జీవింపచేద్దాం!” అంది రాధ —

“రాధా! మామాస్టారు మనస్సుమారదు. ఆయన ఎవరుచెప్పినా వినరు.” అన్నాడు —

“ఏమీ భయపడకండి. ఆభారమంతా నామీద వదలండి. మీరు ప్రశాంతంగా వుండండి” అంటూ ధైర్యం చెప్పిందిరాధ -

♦ ♦ ♦

సుందర్రావు ట్యూటోరియల్ స్కూల్లోరాధ టీచరుగా ప్రవేశించింది. పదినెలల పసిపాపతో నొక్కర్తే ఒక్కగది అద్దెకు తీసుకుని అందులో వుంటోంది. ఉద్యోగంలో ప్రవేశించి ఆరునెలలైనా ఎప్పుడూ ఆమె స్వవిషయాలు అడిగి తెలుసుకో లేదు సుందర్రావు. కాని ఆరోజుతనకు శలవుకావాలని లీవ్ లెటరు పంపించింది రాధ —

ఎందుకో అనుకున్నాడు సుందర్రావు. మర్నాడు– మూడోరోజు నాలుగు _ ఏ రోజుకారోజే శలవు కావాలంటూ వస్తున్నాయి కారణం ఆరోగ్యం బాగుండలేదని ... పదిరోజులవరకూ అదేవిధంగా ఆ విధంగా ఏరోజుకారోజే శలవుకోరుకుంటూన్న రాధ ఆరోగ్యం ఎల్లావుందో తెల్సుకోవాలని మిగతా టీచర్సుని, నౌకరుని అడిగాడు, కాని జబ్బేమిటో; ఎల్లావుందో ఎవరూ సరిగ్గాచెప్పలేదు.

ఆ రోజు అప్రయత్నంగా రాధ గుమ్మంముందు నుంచి వెడుతున్నాడు సుందర్రావు. అరుగుమీద ఏణ్ణర్ధంపాపాయి మూడుచక్రాలసైకిలుతో ఆడుకొంటోంది. సైకిలునులాగుతూ అరుగుచివరికివచ్చేసింది. అది చూచేసరికి సుందర్రావు గుండె అదిరిపోయింది. గభీమనివెళ్లి ఆపాప పడిపోకుండా ఎత్తుకున్నాడు, అంతటితో ఆగక ఆ పాపని తీసుకు లోపలికి వెళ్లాడు, నిర్మానుష్యంగావున్న ఆ గదిలో రాధ ఒకమంచంమీద పడుకొని మూల్గుతుంది.

“మీరా రాధా దేవిగారూ! ఒంట్లో ఎలావుంది?” అని పలకరించాడు సుందర్రావు —

“అబ్బా! నీరసం!! అయ్యో!!! ”అంటూ మూలిగింది —

సుందర్రావు గబగబా పరుగెత్తుకెళ్లి బత్తాయిపళ్లు తెచ్చి రసంతీసియిచ్చాడు. కూర్చుని త్రాగలేని స్థితిలోవున్న రాధని చేత్తోలేవదీసి కూర్చోబెట్టి బత్తాయిరసం త్రాగించాడు. ఆ రాత్రంతా రాధ యింట్లోనేవుండి రాధకి కాఫీకాచియిచ్చి పాపకి అన్నంపెట్టి సేవచేస్తూ తెల్లవార్లూ జాగరంచేశాడు—

సుందర్రావు జీవితం ఈ ఆరేళ్లు ఏకటాకీగా గడిచిపోయింది. ఈ ఆరేళ్ళలో పెద్దమున్సబుగారి కొబ్బరితోటంతా కొనేశాడు. ట్యూటోరియల్ స్కూలు నాల్గురెట్లు పెంపొందించాడు. అన్నివిధాలా తన స్థితిచాలా బాగుంది. తానూ, స్కూలు, విద్యార్థులు పొలం వ్యవసాయం, అంతకి మినహా తన జీవితంలో ముఖ్య విశేషాలేమీలేవన్నట్లు రోజులు ప్రశాంతంగా దొర్లిస్తున్నాడు సుందర్రావు. రాధ తన స్కూల్లోనే పనిచెయ్యడంచేత స్కూల్లోనే అప్పుడప్పుడు విద్యార్థులవిషయమై మాట్లాడేవాడు. అంతకంటే ఆమెతో హెచ్చుపరిచయంలేదు. కాని ఈ నాడు రాధకి అనారోగ్యంగావుంటే మాత్రం తన స్వంతచెల్లెలుగా భావించి సేవచేస్తున్నాడు —

రాధ "అన్నా!" అని పిలుస్తూంటే నిజంగా తనూ, రాధా ఏక గర్భజనిత అన్నా చెల్లెళ్ళనూ అని పించింది. సుందర్రావు మనస్సుకి ఆభావనతోనే రాధకియితరులచేత సేవచేయించేందుకు ఇష్టంలేక తనే స్వయంగా చేస్తున్నాడు. తనొక్క హెడ్మాష్టరు ననిగాని, ఆమెతనక్రింద అసిస్టెంటు అనే భావన కూడా కన్పించలేదు. ఆ అభిమాన హృదయంతో — నాల్గురోజులు సెలవు పెట్టి సుందర్రావు రాధ సేవలో లీనమైపోయాడు —

జీవితంలో ఆనందం, విషాదం, వైరాగ్యం, స్నేహం, వీటి ఆద్యాంతాలు నిర్ణయించినవారెవరూ లేరు, అల్లాగే రాధమీద ఆప్యాయతా, చిన్నపాపాయి మీద అభిమానం ఎందుకు ఎప్పుడు తనకేర్పాడిందో కూడా సుందర్రావుకే తెలీదు. ఈ బాధ్యతను తన నెత్తిన ఎందుకోసం వేసుకున్నాడో అతనికే ఊహాతీతమైన విషయం —

ఆ రోజు స్వయంగా సుందర్రావే పథ్యంవండి రాధకి పెట్టాడు. మధ్యాహ్నం నిద్రపోకూడదని తనే ఆమెకు కాపలాకూర్చున్నాడు.

"రాధా దేవిగారూ! మీ భర్త గారెక్కడున్నారు? ఏంచేస్తారు?" అని ఎంతో అప్యాయతగా అడిగాడు –

"మాస్టారూ! ఈ కష్టసమయంలో మీరే అడుకోకపోతే నాగతి ఏమయ్యేదో!" అంటూ కళ్ళంట నీళ్ళు పెట్టుకొంది రాధ –

"ఛా! తప్పు!! విచారించకండి—ఆపదసమయంలో దైవం ఎవర్నో ఒకర్ని పంపించి ఆదుకునేటట్లు చేయిస్తాడు," అంటూ పెద్ద వేదాంతిలా చెప్పాడు సుందర్రావు —

రాధ మాత్రం ఏకధారగా కళ్ళంట నీళ్లుకారుస్తూ వెక్కి వెక్కి ఏడుస్తూంటే సుందర్రావు హృదయం ద్రవించిపోయింది. అతడుకూడా రాధప్రక్కనే మంచం మీద కూర్చుని జేబురుమాలుతో ఆమెకన్నీరును తుడుస్తూ "చెల్లీ! నీకేంకష్టంవచ్చినా నీతోసమంగా కష్టసుఖాలు పంచుకొందుకు ఈ అన్నయ్యకూడా సిద్ధంగావుంటాడమ్మా! విచారపడకు చెల్లీ! నిన్ను చూస్తూంటే నాకుచెల్లెలులేనిలోటు తీరినట్లుగా వుంది." అంటూ వాత్సల్యంతో ఆమెను దగ్గరగా తీసుకుని కన్నీరుతుడుస్తున్నాడు సుందర్రావు.

హఠాత్తుగా ప్రత్యక్షమైనట్లు జగన్మోహన్ వారి ముందునిల్చున్నాడు. కన్నీటితోనున్న రాధ ఓదార్చే సుందర్రావు మంచంమీద గాఢనిద్రలో వున్న పాపాయికూడా అతడు ఎల్లావచ్చాడోకూడా గుర్తించలేదు. జగన్మోహన్ మంచానికి అడుగు దూరంలోనిలబడి "రాధా! ఇన్నాళ్లూనువ్వొక్కతె ఒంటరిగా వుంటానన్న కారణం ఇదా?" అంటూ ఉరిమాడు —

అతని సింహగర్జనకి దద్దరిల్లి మంచంమీదకూర్చున్న యిద్దరూ ఒకేసారిలేచి నిలబడ్డారు, "జగ...న్మో...హన్" అన్నాడు అప్రయత్నంగా సుందర్రావు –

"మాస్టారూ! నేనులేనిసమయంలో అమాయికురాలైన నాభార్యను చేజిక్కించుకోవడానికి, ఇంతటి నీచత్వానికి వడికట్టే నీచులని నేన్నెడూ అనుకోలేదు. నాభార్యను వంచించి మీ స్వార్థంకోసం వినియోగించుకుంటారని కలలోకూడా నేను భావించలేదు. మీరు విజ్ఞానవంతులనుకున్నానేకాని, వివేకశూన్యులై, పరస్త్రీలకోసం ప్రాకులాడే తుంటరులని ఇప్పుడే గుర్తించాను." అంటూ కళ్లెంటనిప్పులు రాలుస్తూ పళ్ళుపటపటా కొరుకుతూ ప్రళయభీకరమూర్తిలా అయిపోయాడు జగన్మోహన్ —

"జగన్మోహన్! నువ్వు చాలా పొరబడుతున్నావు. ఈమె నాకు సోదరివంటిది. నిష్కారణంగా ఆవేశాన్ని పొందకు" అన్నాడు. సుందర్రావు ముఖంలో బాధా, శోకం మూర్తీభవించినట్లు స్పష్టంగా కన్పిస్తున్నాయి —

"కళ్లముందు కన్పిస్తున్నదానిని నమ్మకుండా వుండేందుకు నేనేంగ్రుడ్డివాణ్ణికాను —" అన్నాడు మూడోనేత్రంవుంటే వారిద్దర్నీ భస్మంచేసేటంత కోపంతో —

"మాస్టారూ! మీరెంతటి అబద్ధాలకైనా వెనుకాడనివారని నాకేనాడో తెలుసు. ఒంటరిగా చిక్కిన వనితను వృధాగా వదుల్తారా? వారంనుంచి మీరిక్కడేవున్నట్లు అంతా ఏకకంఠంతో చెబుతున్నారు. ఏడాదినుంచి మీతో కల్సి ఈమెపని చేస్తోంది. అసలీసంబంధంమీతో ఎంతకాలంనుంచి వుందో తెల్సుకోలేకపోయా. భార్యలేనివారుమీరు; భర్త దగ్గరలేనిదీమె; మీ యిష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తున్నారు. ఛీ! ఛీ! ఛీ!" అంటూ అసహ్యంతో గిర్రునతిరిగి వెళ్ళిపోయాడు జగన్మోహన్ –

సుందర్రావు ఎంతో బాధతో జగన్మోహన్ చేతులుపట్టుకుని "ఇవిచేతులు కావు జగన్మోహన్! కాళ్ళనుకో రాధనిర్దోషి. ఆమెకు జబ్బుగావున్న సమయంలో ఒంటరిగావుందని కళ్లారా చూచాక నాలోని మానవత్వపు జాలిచేతనే నామెకు సహాయ పడ్డానేకాని మరే దురుద్దేశంలేదు. ఇందుకు దైవమే సాక్షి."

"మాష్టారూ! కల్లబొల్లి మాటలతో నన్ను నమ్మించ డానికి మీరేం ప్రయత్నించనక్కర్లేదు. ఆనాడు అమాయకురాలైన తల్లివంటి మహాసాధ్వికేతగని శిక్ష విధించారు. కాని నేనీనాడు మీకే ఈమెను శాశ్వ తంగా వదిలేస్తున్నా. నా బిడ్డను తీసుకు నా దారిన నే పోతా" అంటూ మంచంమీదున్న పాపాయిని గభీ మని లేవదీసి భుజంమీద వేసుకున్నాడు జగన్మోహన్.

రాధ వెళ్లిపోతూన్న జగన్మోహన్ కాళ్ళురెండూ గట్టిగాపట్టుకొని ఎన్నో విధాల వేడుకొంది. తను నిర్దోషినని నెత్తినోరూ మొత్తుకుంది. ఆమె రోదన వింటే శిలలుకూడా కరిగిపోతాయేమోకాని, జగన్మోహన్ మాత్రం రవ్వంతకూడా చలించలేదు. సుందర్రావుకూడా జగన్మోహన్ 'పాపాయితో బయటికి పోకుండా అడ్డుగానిల్చుని చేతులు పట్టుకున్నాడు -

"మాష్టారూ! నాల్గుసంవత్సరాలు తల్లిగా భావించుకున్న మీ అర్ధాంగి తనబిడ్డ ప్రమాద స్థితిలో వుండగా సాటి మానవుడుగా సహాయపడి ఒక్క రాత్రివున్నందుకే మీరు శంకించి ఆవిడ జీవితమే నరకంగా చేసారు. మీరువారంరోజులు రాత్రింబగల్లు ... అందులో పట్టపగలు నా భార్యసరసను కూర్చుండినప్పుడు నేననుమానించటం అధర్మమా? మీ భార్యదోషి అయినప్పుడు మీరు నిర్దోషి ఎల్లా అవుతారో న్యాయంమీరే చెప్పండి"

"జగన్మోహన్! మానవుల జీవితసంఘటనలు ఇల్లాగే విచిత్రంగా సంభవిస్తుంటాయి. విశాలాక్షి కూడా నిర్దోషి అని ఈనాడే అనుభవపూర్వకంగా తెల్సుకున్నా. కష్టసమయంలో మనస్సుకి ఎల్లాంటి శంకలూతట్టవు. ఆపదలో అడ్డుకుందామనే హృదయంకల వ్యక్తులకు భావినిగురించి అనుమానాలు కల్గుతాయని ఊహించకోరు" అంటూ ఎంతో పశ్చాత్తాపంతో అన్నాడు సుందరావు -

"మాష్టారూ!" అంటూ అల్లాగే సుందర్రావు ముఖంలోకి చూస్తూనిల్చున్నాడు -

"జగన్మోహన్! ఆనాడునిన్ను ఆ వేశంతో నేను దూషిస్తూంటే నీ మనస్సెంత క్షోభించిందో ఈ నాడు నేనర్థంచేసుకోగల్గుతున్నా - నన్ను మన్నించు జగన్మోహన్" అంటూ వలవలాకన్నీరుతో అతని చేతులుపట్టుకున్నాడు

"మాష్టారూ! ఇప్పటికైనా మీ రామె సౌశీల్యాన్ని గుర్తించుకున్నారు. అయితే ఏంలాభం? చేతులు కాలాక ఆకులుపట్టినట్లయింది. మీచేత అదరించబడ్డానికి మీభార్యా బిడ్డలీలోకంలో లేరు.

ఆమాటకి అదరిపడ్తూ "విశాలాక్షి జీవించిలేదా? జగన్మోహన్! మురళి ఏమయ్యాడు?" అంటూ అతని భుజాలుపట్టుకు గుంజుతూ ఆరుర్దాగా అడిగాడు సుందర్రావు

"మీచేత తిరస్కరింపడి జీవించడంకంటే మీ దగ్గరనుంచి శాశ్వతంగా శలవు తీసుకోవడమే ఉత్తమ మనుకొన్న ఆమహాసాధ్వి కొడుకుతో సహా సముద్రంలో... ..."జగన్మోహన్! నువ్వు నాదగ్గర నుంచి వెళ్లాకమళ్లి విశాలాక్షిని చూడనేలేదా?..." ఎంతో దుఃఖంతో అడిగాడు -

"ఏం చెప్పమన్నారు మాష్టారూ! నేనెల్లాగైనా ఆమెను రక్షించాలని ఎంతో ఆతృతతో పరుగెత్తి కెళ్లా, కాని అప్పటికే ఆమె కెరటాల్లో ... "ఇంక చెప్పలేక పోయాడు జగన్మోహన్ -

సుందరరావు ఒక్కసారిగా కుప్పలాక్రింద కూలబడిపోయాడు. మూర్తిభరించిన శోకదేవునిలా వల వలా కళ్లంటనీళ్లు కారుస్తూ భోరునఏడుస్తున్నాడు సుందర్రావు. ఆతన్ని ఓదార్చేందుకై రాధ జగన్మోహన్ విశ్వప్రయత్నాలు చేసారు -

"రాధా! మాటకి బదులుమాట సమాధానమివ్వ లేని అమాయకురాలు విశాలాక్షి నాతో నేలోకమని భావించే పరమసాధ్విని చేతులారా చంపుకున్నకిరాత కుణ్ణి. కన్నీటితో కన్నకొడుకునైనా రక్షించమని వేడుకొంటే కాళ్ల తన్నిన దౌర్భాగ్యుణ్ణి - నాపాపానికి ప్రాయశ్చిత్తంలేదు. జగన్మోహన్! భార్యాబిడ్డల్ని పోగొట్టుకొన్న నేను ఇంకెవరికోసం జీవించాలి? ఈ బడి ఈ బాధ్యతానీవుతీసికో. నాపాపపరిహారంగా సన్యాసం స్వీకరించి పారమార్థిక చింతతో నా శేష జీవితాన్ని సార్థకం చేసుకుంటా."

"దుఃఖపడకండి మాష్టారూ! మీ భార్యబిడ్డల మీది ప్రేమను మీనున్న విద్యార్థులమీదికి మళ్లించి

"మీ జీవితాన్ని సార్థకం చేసుకోండి." అంది రాధ

"రాధా! నా బాధ మీకర్థం కాదమ్మా! ఇన్నాళ్లూ సత్యాన్ని గుర్తించుకోలేక పోయాను. కాబట్టి నిర్విచారంగా జీవించగల్గాను. ఇంక ఒక్క క్షణంకూడా నేను జీవించలేను. జీవించినా యీ పరిసర ప్రాంతాల్లో సీతా మహాసాధ్వివంటి విశాలాక్షిని తల్చుకుంటూ నేనుండలేను." అంటూ రెండు చేతులతోనూ ముఖాన్ని దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు సుందరావు.

అల్లా రాత్రి వరకూ సుందరావు భార్యనీ, కొడుకునీ తల్చుకొని భోరునకంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూనే వున్నాడు. ఏడు సంవత్సరాల దుఃఖమంతా ఏడు గంటల్లో సముద్రం పొంగినట్లు కన్నీటి కెరటాల్లో దారీతెన్నూ కానక కొట్టుకుపోతున్నాడు సుందర్రావు —

రాత్రి సుందర్రావును రాధ, జగన్మోహన్‌లు కల్సి మెల్లగా అతని యింటికి తీసుకువెళ్లారు. తన యింట్లో కాలుపెట్టేసరికి సుందర్రావుకి విశాలాక్షి తనూ కలిసిగడిపిన కాలమంతా కళ్లముందు నాట్యం చేస్తున్నట్లు అనిపించింది. చివరిసారిగా కన్నీటితో కొడుకుని భుజాన్ని వేసుకు విశాలాక్షి వెళ్లిపోతోన్న దృశ్యాన్ని తల్చుకుని భోరున ఏడుస్తూ పశ్చాత్తాపంతో కుమిలి పోతున్నాడు. రాధ, జగన్మోహన్ ఇద్దరూ అతన్ని ఓదార్చలేక అల్లాగే శిలావిగ్రహాల్లాగ కూర్చుండిపోయారు. సుందర్రావుకి సానుభూతి చూపిస్తున్నట్లుగా ప్రకృతికూడా విచారమేఘాల్ని కమ్ముకుంది. క్షణాలమీద మబ్బులు గూడుకట్టుకుని వర్షం ప్రారంభమైంది —

ఆకాశం చిల్లులు పడ్డట్టు ఏనుగు తొండంధారతో వర్షం కురుస్తోంటే; సుందరావు కళ్లంటకడవలకొద్దీ కన్నీరు ధారగా ప్రవహిస్తోంది. ఈ భయంకరభీభత్స దృశ్యాన్ని చూల్లేక రాధా జగన్మోహనులు క్షణమొక యుగంలా కన్నీటితో ఘంటలు లెక్కపెట్టుకుంటూ కూర్చున్నారు. —

తల్పుతట్టినట్లు శబ్దం వినిపించింది. రాధ లేచివెళ్లి వీధి తలుపుతెరచి చూచింది. ఏడేళ్ళబాలుణ్ణి చేత్తో పట్టుకుని, హడలుకూ బెదురుతో శోకంతో గొంతుకపూడిపోయే స్వరంతో "మా...స్టా...రు ...ఎ...ల్లా...వు...న్నా...రు" అంటూ నూతిలో నుంచి వచ్చేస్వరంలా అడుగుతూ లోపలికి అడుగు పెట్టింది ఆ స్త్రీమూర్తి.

ఆమెను చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకువచ్చింది రాధ.

కన్నీటితో తలపైకెత్తి చూచాడు సుందరావు.

"విశాలా!" అంటూ గభీలునలేచి వెళ్లి ఆమె రెండు చేతులూ పట్టుకున్నాడు —

"విశాలా! నువ్వు జీవించేవున్నావా?" అంటూ పిచ్చివానిలా ఆమె చేతులు తనచేతుల్లోకి తీసుకొన్నాడు —

ఇదికలా — నిజమా — భ్రాంతా! ఏదీ అర్థంకానట్లు అయోమయంగా విశాలాక్షి సుందర్రావులు ఒకరి ముఖాల్లోకి ఒకరుచూచుకుని కన్నీరుకారుస్తున్నారు.

"నన్ను క్షమించండి. మీ దగ్గర దాసీగా వుండి మీకు సేవచేసేందుకైనా -మీ సన్నిధిలో స్థానం ఇవ్వండి" అంటూ పాదాలమీద శిరస్సువుంచి కన్నీటితో అడిగింది విశాలాక్షి —

"విశాలా! నిన్ను చూడ్డమే నా అదృష్టం. ఇంక యీ జీవితంలో ఒక్క క్షణంకూడా నిన్ను వదలను. మన అబ్బాయి ..."

"ఇడుగో మన అబ్బాయి మురళి ..."

"విశాలా! ఇప్పుడు నువ్వెలా వచ్చావ్? ఇదంతా ఏదో అయోమయంగావుంది" అంటూ మురళిని మనసారా ఎత్తుకున్నాడు. సుందర్రావు —

"మాస్టారూ! మీకు ఎంతకాలం ఎందరిచేత చెప్పించనా విశాలాక్షిగారి నిర్దోషిత్వం తెల్సుకోలేక పోయారు. అందుకే నేను మీ స్కూల్లో పంతులమ్మగాచేరాను. సత్యాన్ని ఋజువుచేసి, మీకళ్లకు చూపించి, ఈమె మహాసాధ్వి అని నిరూపించాను." అంది రాధ —

"అమ్మా!" అంటూ విశాలాక్షి పాదాలకి నమస్కారంచేసాడు జగన్మోహన్ —

"నాకు టెలిగ్రాం యిచ్చిందెవరు?" అంది విశాలాక్షి.

"నేనమ్మా నువ్వెక్కడున్నావో తెల్సుకుందుకు పంచవర్షాలు దేశమంతా గాలించాను. చిట్టచీవరకు ఆ పల్లెటూల్లో అజ్ఞాతంగా జీవయాత్రచేసే నిన్నుగుర్తించాను. రాధ సహాయంతో మాస్టారు మీ పవిత్రశీలాన్ని గ్రహించగల్గేరు. వెంటనే టెలిగ్రాం

ఇచ్చాను. ఆసమయంలో ఏ విధంగా యివ్వాలో అర్థంగాక మిమ్మల్ని వెంటనేరప్పించేందుకు సీరియస్‌గావుందని టెలిగ్రాం యిచ్చినందుకు క్షమించమ్మా" అంటూ పసివానిలా ఆమెపాదాలు చుట్టేశాడు జగన్మోహన్ —

"జగన్మోహన్! మీరంతా క్షమించవలసినది నన్ను." అన్నాడు సుందర్రావు —

"ఇదంతా మన మురళీకృష్ణుని అనుగ్రహం" అంటూ ఆమె నిత్యంపూజించే మాలవేసే కృష్ణుని విగ్రహానికి మోకరించి నమస్కరిస్తోంటే భార్య ననుసరిస్తూ ఆమెప్రక్కనే సుందర్రావు మురళీకృష్ణునికి మనసారా నమస్కృతులు అర్పించాడు. అల్లాభక్తి పరవశులై మురళీమోహనుని ధ్యానంలోలీనమైన ఆ దంపతులను రాధా జగన్మోహనులు నమస్కరించారు.

కన్నీటి కెరటాలను ఈదుకుని ఒడ్డుకుచేరి ఆనందలోకాల్లో అడుగుపెడుతున్నారుసుమా అని హెచ్చరిస్తూన్నట్లు బాలభానుడు లేత వెలుగు కిరణాలను వారందరిపైకి ప్రసరించాడు —








# ఇంటిపనులు

బొహుస్లావ్ బ్రెజోవ్స్కీ

చూసారూ, మనమున్న కాలం సాంఘికీకరణ, పునర్వ్యవస్థీకరణ, వికేంద్రకరణ, ప్రజాస్వామికీకరణలకాలం. సాంఘిక జీవితంలోనే కాదు సుమండీ, కుటుంబ జీవితంలో కూడా. పూర్వంకుటుంబానికి అధిపతులైన వారు యిప్పుడు సమానహోదాతో సమాన భాగస్థులైపోతున్నారు. బాబూ, దీనితోనే గృహయజమానులకాలం అడుగంటిపోయింది. ఈ అంటువ్యాధి దావానలంలాగ ప్రాకిపోతున్నదంటేనమ్మండి! ప్రతిఘటించి మాత్రంయేమీలాభంలేదు. ఏనాడో ఒకనాడు మనంలొంగిపోకతప్పదు. ఆరోజులన్నీ పోనేపోయాయి. మధ్యాహ్నంపూట ఒకకునుకు తీయటం, ఆదివారాల్లో బాగా తెల్లవారిపోయినా ప్రక్కమీదినుంచిలేవకుండా హాయిగా పడుకోటం, ఇంటికి చేరుకోగానే యిల్లాలు భయభక్తులతో వచ్చి సేవచేయటం - అన్నీ గతకాలపు విషయాలై పోయాయి.

నిర్దాక్షిణ్యంగా మగవారిని దారిలో పెట్టేకాలం ప్రాప్తించింది.

'పొయ్యిమీద కూర ఉడుకుతున్నది, కాస్త కర్రలు ఎగదొయ్యి; గిన్నెలు కడిగెయ్యి-చొక్కా చేతులుమాత్రం పైకి లాక్కో, లేకపోతే చొక్కా మళ్ళీ ఉతుక్కోవలసిన ఖర్మం పడుతుంది; పోయి పాపను శిశుసంరక్షణాలయంనుంచి తీసుకురా; అలానే వచ్చేటప్పుడు పాలుకూడా తీసుకురా; పిల్లలకు భోజనం తయారుచెయ్యి; వాళ్లకు స్నానాలు చేయించు; ఇంతకూ మీటింగు మాట మర్చిపోయేవు సుమా ... ...' వీటిని ప్రతిఘటించేవారు కొందరు ఉండకపోరు. కాని వాళ్ళైనా మానవమాత్రులే. ఏనాడో ఒకనాడు లొంగకతప్పదనుకోండి. వారు నలుగురు నోళ్ళల్లోపడి నవ్వులపాలుకావటం తప్ప వేరేజరిగేదేమీ ఉండదు. పెళ్ళాం ఇల్లుకడుగుతుంటే సోమరిపోతులా నిలబడి చూస్తూ ఉండే ఆజంతువును ఒకసారి చూడండి! మగవాళ్లపన్లూ, ఆడవాళ్లపన్లూ అంటూ యింకా విచక్షణ చూపేవాడిని చూచి ఆ వీధిలో వాళ్లు, ఆ చుట్టుపట్ల ఉన్న స్త్రీలు నవ్వితే మాత్రం తప్పేమి?

ఇప్పటికే లొంగిపోయిన మాలాంటి వాళ్ళు అలాంటి సోమరిపోతుల్ని చూసిన యీర్ష్యపడము. పైగా బుద్ధితెచ్చుకొన్న వాళ్లు ఇంకా తప్పు త్రోవలో ఉన్నవాళ్లను చూచి జాలిపడినట్టు జాలిపడతాము. ఆ రోజులే పోయాయి. భార్యలు ఊరు వెళితే మనపురుషస్వభావం విచ్చలవిడిగా నృత్యంచేసే ఆ రోజులు మరిరావు. తిన్న కంచాలు కడగకుండా మూలపడేసి, రాత్రి కూరవండిన గిన్నెలోనే ప్రొద్దుట కాఫీ పెట్టుకోటం, ఇంటినిండా ఎక్కడ బడితే అక్కడ సిగరెట్‌పీకలు పారెయ్యటం, పక్క దులుపుకోకుండానే దానిమీదపడి నిద్రపోవటం, బూట్లుతుడుచుకోకపోవటం - ఇలాంటివిచేయటమంటే ఆ రోజుల్లో ఎంత ఆనందంగా ఉండేది!

కాని యిప్పుడు మనపాలిట సవరణ ఉద్యమం అంటూ వచ్చిపడింది. మన పురుషస్వభావం, నిర్లక్ష్యపు ఆ విశాల దృష్టి అడుగంటిపోనే పోతున్నాయి. మన మనో నిబ్బరం సడలిపోతున్నది. మన భార్యలు ఊళ్ళో లేకపోయినా విచ్చలవిడిగా హాయిగా గడపలేక పోతున్నాము.

కొత్తగా వచ్చిపడిన అలవాట్లు మన విచ్చలవిడి జీవితాన్నే పాడు చేస్తాయి. అంటుగిన్నెలు అలాపడుంటే చూచి సహించలేము, అనుకోకుండానే మన చేతులు వాటిని పరిశుభ్రపరుస్తాయి. పూలమొక్కలకు నీళ్లు పోస్తాము. పక్కబట్టల్ని యెండలో వేస్తాము. వంటవండుకొంటాము. పాపకు స్నానం చేయించి బట్టలువేస్తాము. ఈ పనులన్ని యెంత నేర్పుతో చేసేస్తున్నాము! అంతేగాదు, మనం ఇంతకంటేకూడా యెక్కువే చేయగలం. కాని అది మనలో మాట. మగవాళ్ళమైన మనకు కొత్తవిషయాలను కనిపెట్టటంలో, ప్రకృతిరహస్యాలను ఛేదించటంలో గొప్ప నేర్పుఉన్నది. పెద్దపరుపును మెట్లన్నిదిగుతూ మోసుకుపోవటం దేనికి? పైనించి భూమ్మీదికి ఒక్కసారే విసిరివేస్తాము. పొయ్యిముట్టించటంలో పాతపద్ధతులకుస్వస్తిచెప్పేస్తాము. కాగితం, పుల్లలు, బొగ్గూ యెందుకు? మంటకావాలంటే గ్యాసు ఉపయోగిస్తాం. గుడ్డలుతికేయంత్రం, కాఫీపొడికొట్టే పరికరం, వాక్యూమ్‌క్లీనర్ మొదలైనవన్నీ ఇంటిచాకిరి చేయటంలో కష్టమేమిటో తెలిసినమగవారే కనిపెట్టారని నా మతం. ఎందుకూ ప్రెజర్‌కుక్కర్ ఉన్నదే అదేనా వాదనను బలపరుస్తుంది. దానిని కనిపెట్టినది పాపిన్ అనే పురుషుడే గాని స్త్రీ మాత్రంకాదుగదా? నేను మాత్రం యీ సందర్భంలో ఒక విషయాన్ని గట్టిగా చెప్పగలను. పురుషపుంగవులమైన మన అపజయంఉన్నదే, అది ఇంటిపనుల్లోయాంత్రికీకరణను మరింత అధికంచేయటానికోహదంచేసి తీరుతుంది. అందులో యేలాంటి సందేహమూ ఉండకూడదు.

ఇంటి పనులను చూచుకొనేసందర్భంలో యిప్పుడు మనం యెంతటిదూరదృష్టిని, యెంతటి శ్రద్ధనూవహిస్తున్నాము! ఎంతో శ్రద్ధతో, ఆసక్తితో రేడియో స్త్రీల కార్యక్రమాన్ని వింటున్నాము; స్త్రీల పత్రికలను చదువుతున్నాము – పురుషుల పత్రికలు లేకనా? ఇంటి చాకిరీని తగ్గించేయే సాధనం వచ్చినా శ్రద్ధగా దానినిగురించి తెలుసుకొంటున్నాము. – మరి మనభుజాల మీదకూడా పడిందిగాయింటిపని) ఇది వరకు ఇల్లాళ్లు మాత్రమే ఉండేవాళ్లు, కాని యిల్లాయనలు (ఇంటాయనలు అంటే యిప్పుడు అర్థంమారిపోయిందిగా) కూడా వెలిసారు.

ఇటీవలనే నొక దుకాణానికి వెళ్ళినప్పుడు యీ దిగువసంభాషణవిన్నాను.

"వంటరిగా వచ్చావేమమ్మా! ఇంటాయనకు వంట్లో బాగోలేదా?" అని దుకాణపు మనిషి ఒకామెను అడిగింది.

"అది కాదమ్మా! ఇంటాయనను పెట్టుకొని వంటచేయించుకోవటమంటే సామాన్యమైన విషయంకాదు. తిండికయ్యేది యింతా అంతా కాదు. మగవాళ్లకంటంటే తడిసిమోపెడవుతుంది."

ఒక నిట్టూర్పు విడిచి ఆమె నువ్వూ నేనూ జన్మలో మరువలేని యీ మాటలన్నది;

"హాయిగా ఉండాలంటే ఇంటాయనా, పిల్లలు, వంటిల్లు పన్నుయేమీ లేనియిల్లే యిల్లు"

పురుషపుంగవుల్లారా! యీమాటలను లెక్కచేయబోకండి. ఇంట్లో ఆడవాళ్లు లేకపోయినా పన్లన్నీ మనం చేసుకోగలమని తెలిసి పోతున్నందువల్ల కలుగుతున్న యీర్ష్యేఅదీ. ఇంతమాత్రంలో మనం వెనకడుగు వేస్తామా! వంటింట్లో మనకూ హక్కున్నది. ఏమైనా సరేమనం అక్కడ మనస్థానాన్ని కాపాడుకోవాలి.

## సంక్రాంతి పర్వశుభాకాంక్ష

శ్రీ విశ్వనాధకవి

(ఆంధ్ర సాహితీ ప్రచారసభ, పశ్చిమ బెంగాల్)

—o—

చింతా క్రాంత జగత్తునన్ నవసుఖ
 శ్రేయఃప్రభన్ మూఢతా
ధ్వాంతంబున్ హరియించి, జ్ఞానరవిబిం
 బ స్ఫూర్తిం జేకూర్చి, హే
మంతాంతర్గత శైత్య బాధ నశియిం
 పంజేయ విచ్చేయు సం
క్రాంతి శ్రీ "గృహలక్ష్మి"కిన్ విజయ
 ముల్,
 కల్యాణముల్ గూర్చుతన్!

# ముచ్చటలు - మురిపాలు

శ్రీ హరగోపాల్, బి. ఏ.



"ఇవాళ బావ వస్తాడని అందరూ ఎంత సంబర పడుతున్నారు! అమ్మ అందరిని పెందరాళే లేపి, తలంట్లుపోసింది. నాన్నగారు నిన్ననే సాయంత్రం వచ్చేటప్పుడు, మిషను కుట్టువానికిచ్చిన కొత్త బట్టలను తెచ్చారు. అన్నయ్యా, తమ్ముడు వాటిని కట్టుకుని బావను తీసుకురావడానికి స్టేషనుకు వెళ్లారు. అక్కయ్య ఇవాళ ఎంత కళకళలాడుతోంది! అమ్మా తను వెళ్ళి, హైదరాబాద్ స్టోర్సులో, ఎంతోసేపు తనిఖీచేసి సెలక్టుచేసి కొన్న, ఆ గులాబిరంగు-చీర కట్టుకుని, తన వంకలజుట్టును ఎంత అందంగా దువ్వుకుంది!...తన ముఖంమీదకు ఆ నులివెంట్రుకలు అందంగా పడేలా, ప్రయాసపడి ఎంతబాగా అమర్చుకుంది!...తనూ, తన స్నేహితులు కలిసి, దీన దయాళుగారి బంగారం కొట్టులో కొన్న కొత్తరకం నెక్లేసు మెళ్ళో వేసుకుంది. తన కాళ్ళకు చేతులకు, తన అత్తగారు, మామగారు చేయించిన పట్టాలు, గాజులు వేసుకుంది. క్రిందటిసారి తనూ, బావ కలిసి తిరుపతి వెళ్ళినప్పుడు, మద్రాసుగూడ అలా వెళ్ళినపుడు, బావ ఎంతో ముచ్చటపడి కొన్న, ఆ చెమికీ జాకెట్టును తొడుక్కుని కూనిరాగాలు తీసుకుంటూ మంచంమీద బోర్లాపడుకుని ఎంత వయ్యారంగా పత్రిక చదువుతోందో!...ఇదంతా "ఆయన" వస్తాడనే సంబరంకాబోలు! పైకి నేను అంటే మొట్టుతుంది బాబోయ్!...నేనూ, రేపు 'ఆయన' వస్తాడంటే ఇలానే మధనపడతాను కాబోలు!" అని శారద తనలో భావించగానే, సిగ్గుతో ఆమె బుగ్గలు కందిపోయాయి. ఎవరైనా పసికట్టారేమో అని నాలుక కరుచుకుని, అటుఇటు చూచి, అమ్మ ఉన్న వంటింట్లోకి దారితీసింది.

అమ్మ ఏమిటో రకరకాల పిండి వంటలు, పత్రికలో చూచి చదువుతూ చేయజూస్తోంది.

"ఏమిటే అమ్మ! ఆ పుస్తకంలో చూస్తూ వండుతున్నావ్" ప్రశ్నించింది శారద.

"వచ్చావా తల్లీ! రా! నిన్ను పిలుద్దామని అనుకుంటూంటే నీవే వచ్చావ్. ఇది నాకు చదివి చెప్పమ్మ!" అని అంది పనిభారంవల్ల ఊపిరి తీసుకుంటూ రాజ్యలక్ష్మి.

ఇంతలో పక్కఇంటి రంగమ్మ వచ్చి "ఏమండోయ్! రాజ్యలక్ష్మమ్మగారు! ఏమిటి హడావిడి? వేపపువ్వు పచ్చడి తినడం అయిందా?" అని ప్రశ్నించింది విడ్డూరంగా.

"వేపపువ్వు పచ్చడేమిటండీ?" అని ప్రశ్నించింది రాజ్యలక్ష్మి ఆశ్చర్యపోతూ.

"ఇవాళ సంక్రాంతి కదండీ! అందుచేత పరగడుపున, వేపపువ్వు పచ్చడి తినవద్దూ?" అని గదమాయించింది గంభీరంగా రంగమ్మ.

శారద పకపకనవ్వింది. "పిన్నిగారూ! మీరు పూర్తిగా మన పండుగలు, మన ఆచారాలు మర్చిపోయినట్లున్నారు. సంక్రాంతికీ, సంవత్సరాదికీ తేడానే తెలియదా? వేపపువ్వు పచ్చడి తినేది సంవత్సరాదికిగాని సంక్రాంతికి కాదు" అంది.

"అయ్యో రామా!" అని దవడలు నొక్కుకుని "మా చంటివెధవ గోలచేస్తే చేసిపెట్టాను కూడాను" అంది రంగమ్మ. ఒక్కక్షణం ఆగి "ఏమిటక్కయ్యగారు! చాల హడావిడిగా వున్నారు?" అని మళ్ళీ ప్రశ్నించింది.

"ఏం చెప్పను అక్కయ్యా! ఇవాళ, రాకరాక అల్లుడుగారు వస్తున్నారంటే నాకు మడ్డిమీద గుడ్డ కూడ వుండడంలేదు" అంది రాజ్యలక్ష్మి నూనెలో 'చుయ్'మనిపిస్తూ.

"అయ్యో రామా!" అసలు వచ్చినపనే మర్చిపోయాను. చూడక్కయ్య మీ ఇంట్లో రెండు కరివేపాకు రెబ్బలుంటే ఇస్తావా? మా మరిది కరివేపాకు రసం లేకపోతే అన్నమే ముట్టరు. మా పెద్దవెధవకి, బజారుకెళ్ళేటప్పుడు మరీమరీ చెప్పానునుమండీ! వాడు అన్నీ తెచ్చాడుకాని ఇదిమాత్రం మర్చిపోయాడు. వాడు చదివింది బి.ఏ. గాని వంకాయలు బేరం చెయ్యడంగూడ తెలియదు" అంది తన బాధను, అసహాయస్థితిని వెళ్ళగక్కుతూ రంగమ్మ.

"పిన్నిగారు, మీ పిల్లలను 'వెధవ వెధవ' అని పదేపదే తిడుతున్నారు. ఇవాళ తిట్టిన తిట్లన్నీ దీవనలవుతాయండి! అందులో తల్లి తిట్లన్నీ ఎప్పుడూ దీవనలే" అంది కరివేపాకు ఇస్తూ.

"వస్తానమ్మా! నావల్ల పనికి ఇబ్బంది కలిగిందో ఏమో! కర్మ!" అని రంగమ్మ నిష్క్రమిస్తూ వుండగా "పిన్నిగారు! ఇవాళ ద్వారబంధాలు, తలుపులూ జాగ్రత్త! లేకపోతే భోగి మంటలకు ఆహుతవుతాయి" అని నవ్వుతూ అంటూ దొడ్డి తలుపు చేరవేసింది శారద.

ఇంతలో బాబిగాడు "అమ్మా! అమ్మా! బావ వచ్చాడే" అని అరుచుకుంటూ వచ్చాడు వంటింట్లోకి. వెంటనే రాజ్యలక్ష్మి చెయ్యి కడుక్కొని, "అన్నయ్యను నాన్నగార్ని, ఆ లైబ్రరీలో ఆ కచేరీలో వెళ్ళి పిలుచుకురా" అంది చెయ్యి తుడుచుకుంటూ.

"నాన్నగారు, అన్నయ్య, బావ అందరూ సావిట్లో కూర్చున్నారమ్మా!" అన్నాడు బాబిగాడు.

"శారదా! బావ కడుక్కోవడానికి, త్రాగడానికి నీళ్ళందియ్యి" అని పురమాయించి తను వసారాలోకి వచ్చింది రాజ్యలక్ష్మి.

"చూడమ్మా! బావని వచ్చేటప్పుడు నాకు హేండ్ కెమెరా తీసుకురమ్మంటే తీసుకురాలేదు" అని నేరం చెప్పాడు రఘు.

"ఉస్." తప్పని సంజ్ఞచేసి "అంతా కులాసాయేనా?" అని ప్రశ్నించింది రాజ్యలక్ష్మి అల్లుడికేసి చూస్తూ.

"హి హి హి అంతా కులాసాయేనండి" అన్నాడు రమేష్ భూమికేసి చూస్తూ సిగ్గుపడుతూ.

అల్లుడు కొత్తమూలంగా సిగ్గుపడుతున్నాడని గ్రహించి వంటింట్లోకి వెళ్ళిపోయింది రాజ్యలక్ష్మి.

"ఈమధ్య ఏదో చిత్రానికి మాటలు పాటలు వ్రాస్తున్నావని విన్నాను నిజమేనా?" అని ప్రశ్నించారు శరభయ్య అల్లుడ్ని.

"అవును నాన్నా! 'బ్రతికిపోవాలంటే;' అనే చిత్రానికి వ్రాస్తున్నాడు" అన్నాడు రఘు.

బావమరిది మాటకు నవ్వి "ఇదే ప్రథమమండి! ఏదో వ్రాస్తున్నాను. దీనిమీద అంతగా ఆశ పెట్టుకో లేదు" అని నసిగాడు రమేష్.

"రెండుమూడు అయితేనేగాని వైద్యుడు కాడు. దానికేంలే కాని నిరుత్సాహపడకు. సాహిత్య గోష్ఠులలో నీ పేరు వింటున్నప్పుడు నీకు భవిష్యత్తు వుందని అప్పుడే అనుకున్నాను" అన్నాడు శరభయ్య.

"ఏమోనండి! అంతా భగవంతునిదయ, మీ చలవ" అన్నాడు రమేష్.

"లే నాయనా! చాలా దూరంనుంచి వచ్చావు; నీళ్ళు పోసుకో. అబ్బాయి! రఘు! నాతో రా భోగి పళ్ళు తీసుకువద్దువుగాని" అనిచెప్పి కండువా బుజాన్న వేసుకుని వీధిలోకి నడిచాడు శరభయ్య.

2

సరిగా సాయంత్రం 5 గంటలయింది. బీచివద్ద కళకళలాడుతోంది. ఇసుకతిప్పలమీద పిల్లలు పిల్లిమొగ్గలు వేస్తున్నారు.. దంపతులు చెయ్యిచెయ్యి పట్టుకుని నడుస్తున్నారు. బొంబాయి మిఠాయి అమ్మేవాడు, వాచీలను, సైకిళ్ళను ఆ సాగే మిఠాయితో చేస్తూ, పాటలు పాడుతూ, వాటిని పిల్లలకిచ్చి, వాళ్ళ దగ్గరవున్న డబ్బులు గుంజుకుంటున్నాడు. వీధి నాట్యకత్తెలు నాట్యము చేస్తున్నారు. ఇవంతా చూసి సముద్రుడు సంతోషం పట్టలేక బలంకొద్ది తాకుతూ పెద్దగా ఘోష పెడుతూ పరవళ్ళు త్రొక్కుతున్నాడు.

దూరంగా బుడగలమ్ముతున్నవాడ్ని చూసి "అక్కయ్యా! నాకు ఆ బుడగ కావాలి?" అని మారాంచేశాడు బాబిగాడు.

"రఘు! వీడికది కొనిపెట్టు" అన్నాడు రమేష్.

"అక్కయ్యా! నేనుగూడ వాళ్ళతో అల్లా వెళ్ళి వస్తాను" అని దీనంగా అడిగింది శారద. కాసేపు తటపటాయించి, "సరే పో! వంటిమీద నగలు జాగ్రత్త! నీవు పట్టి తొందరపిల్లవి" అంది శోభ.

అ మాటకు మూతి తిప్పుకుంటూ అన్నయ్యను, తమ్ముడ్ని అనుసరించింది శారద.

"శోభ! నాతో మాట్లాడటం, కనిపించడం మానేశావేం?" దగ్గరగా జరిగి అడిగాడు రమేష్.

దూరంగా జరుగుతూ "మీరు నాకు కనిపించారు కనుకనా ? ఇన్నాళ్ళు" అంది విసురుగా.

"కోపమొచ్చిందా ?" లాలనగా అడిగాడు చెయ్యిపట్టుకుని లాగుతూ.

"చాల్లెండి ఎవరైనా చూస్తారు."

"ఇవాళ సినిమాకు వెడదామా ?"

"మీరు వ్రాసిన సినిమా ఏంలేదు. నన్ను మెప్పించడానికి, మీరు చూపించడానికి" అంది ముఖం మరోవైపుకు త్రిప్పుకుని.

"శోభ ! ఇన్నాళ్ళు ఆలస్యం చేశాననేగా నీ నిర్లక్ష్యం. ఏ ఉద్యోగంలేకుండా అత్తవారింటికొస్తే అల్లుడికి ఏమైనా గౌరవముంటుందా ! నీవే చెప్పు.– అందుచేతనే ఇన్నాళ్ళు రాలేదు. ఇప్పుడైన నన్ను అనుగ్రహించు" అన్నాడు రమేష్ లాలిస్తూ.

"మీ మొగాళ్ళెప్పుడూ ఇంతే. ఆడవాళ్ళ మెతకతనం గ్రహించి, ముఖస్తుతితో ఉబ్బిస్తారు" అని ఆతని కండ్లలోకి చూసింది శోభ.

ఇంతలో ఒకటుడగ వారి ఇద్దరి ముఖాలమీద వాలి నిలబడింది. ఇద్దరూ కంగారుపడి చూసేసరికి ఎదురుగా బాబిగాడు నవ్వుతూ కనిపించాడు. "అన్నయ్యా! అక్కయ్య బావతో మాట్లాడుతోంది" అన్నాడు పకపకమంటూ.

శోభ వాడి మాటలకు ముచ్చటపడి, వాణ్ని ఎత్తుకుని, గట్టిగా కౌగలించుకుని, వాడి బుడగను వాడిచేతిలో పెడుతూ "బావతో అక్క మాట్లాడితే ఏంరా ? నీకేం తెలిసిందిరా నవ్వడానికి ?" అని అడుగుతూ గట్టిగా ముద్దుపెట్టుకుంది.

"బావ! ప్రొద్దుపోయింది. టాక్సీ సిద్ధంగావుంది. బయలుదేరండి" అన్నాడు రఘు.

"శారద అక్కయ్యనడుగు ఏమంటుందో ?" అన్నాడు రమేష్.

"నేనెందుకడగాలి ? నీవే అడుగు" అంది శారద.

"ఎవరూ అడగక్కరలేదు. ఇంటికి పోదాం అని చెప్పు బాబు" అంది శోభ బాబిగాడితో.

వచ్చీరాని మాటలతో బాబిగాడు అలా అంటూంటే అందరూ నవ్వుతూ టాక్సీ ఎక్కారు.

హారన్ కొట్టుకుంటూ టాక్సీ జోరుగా పరుగెత్త సాగింది రోడ్డుమీద. దూరంగా ఉన్న పార్కులోని రేడియో పాట వినిపించగానే రమేష్, "త్రుళ్ళిపడి, "శారద మీ అక్కయ్య మొగుడు వ్రాసిన పాట రేడియోలోంచి వినిపిస్తోంది. నీవు మీ అక్కయ్య జాగ్రత్తగా వినండి" అన్నాడు నవ్వుతూ రమేష్.

అందరూ ముసిముసి నవ్వులు నవ్వుతూ విన సాగారు ఆ పాటను.

"సంక్రాంతి ! వెదజల్లవే ! నవ్యకాంతి !
చలితో వణికించేటి చెడ్డరోజులు పోయి
ముదము చేకూర్చెడి మంచిరోజులు మాకు
వెదజల్లవే సంక్రాంతి ! వెదజల్లవే నవ్యకాంతి !
నీచభావాలన్ని భోగిమంటలలోన
భస్మమైపోయి, మసియైపోయి,
క్రొంగొత్తవెలుగులో క్రొత్తభావాలను,
మంచిభావాలను, వెదజల్లవే సంక్రాంతి !
చీకటిలో కొట్టుకొను యుద్ధోన్మాదులకు
'శాంతి' యను కాగడా చూపించవమ్మ !
వసుధైక కుటుంబము ఇల వర్ధిల్ల
విజ్ఞానకాంతినే వెదజల్లవమ్మ !
సంక్రాంతి ! వెదజల్లవే ! నవ్యకాంతి !"

ఆరోజు రాత్రి, రాబోయే సంక్రాంతి, పాటలోని 'నవ్యకాంతిని' వెదజల్లినట్లు కలగన్నారు అందరూ

# ముద్దుకృష్ణ

శ్రీమతి దేశిరాజు భారతీదేవి



(గతసంచిక తరువాయి)

కొల్లగానింట పెరుగు పాల్గొరత లేక
నున్న పొరుగింట కడవలనున్న పాలు
పెరుగుఁద్రావగ నంతగా బెనగెదేల
వద్దువద్దన్న నిలువక ముద్దుకృష్ణ.

మన్నుదిననేల తల్లి గన్గొన్న వేళ
లేదు తినలేదు నే దినలేదటంచు
కల్లలాడంగనేల! నివ్వసరిజూడ
విశ్వమును జూపనేల గోవిందకృష్ణ!

కొంటెవై దొంగవై పొరుగింటికేగి
యింటిలో వారలెవరు లేకుంటజూచి
జొచ్చి పెరుగును పాలును జూరగొంట
హద్దులేనట్టి నడువడి! ముద్దుకృష్ణ.

పొట్టివానికి పుట్టెడు బుద్ధులనెడు
సామ్యమున నందుకోలేని సమయమందు
పాలకుండల బెనుటూట్ల పాలుసేయు
పని యదెట్టుల దోచె గోపాలకృష్ణ.

లేక లేక పుట్టిన బిడ్డలేయటంచు
చూచిచూడక పోనిచ్చి గాచినారు
గాక నీ చేష్టల సహింప, గలరె యెందు
పొరుగువారల కాంతలు, ముద్దుకృష్ణ!

మునుల హృదయాంబుజంబుల మూల నొదిగి
అందున వారెడు మకరందమాను నీకు
గోపికల కొంపలఁ గ్రాగుకుండపాలు
పొలుపు రుచియింపనయ్యెనే ముద్దుకృష్ణ!

చిట్టి కొంచెము కూత ఘనాట్టహాస
మనెడు తెలుగున పూతనపాలుఁ ద్రావ
శిశువవై దాని జంపగా, శివుడవై తి
పురమి నీ కెవ్వరీడురా ముద్దుకృష్ణ.

శాస్త్రములు వేదములు గురుసన్నిధాన
మందు నేర్చితివని తెలియంగవచ్చె
విశ్వమోహనకరమైన, వేణుగాన
విద్య యెల్లబ్బె నీకు గోవిందకృష్ణ!

గొల్లపిల్లలు నీ పాట కొసరి కొసరి
యడిగి వినగోర బృందావనాంతమున
నంతకంతకు రసమూరునట్లు నీవు
పాటబాడితివేర గోపాలకృష్ణ!

పిల్లలననేల యావనుల్ పెద్దలనగ
నేల! యవ్వేళ వ్రేపల్లెనెల్లవారు
గానరసమూని యానంద, కలితులైరి
పరమ గానవిలోల గోపాలకృష్ణ!

నళినలోచన బృందావనంబునందు
మురళి చేబూని యానందపూరమైన
వేణుగానంబు సల్పిన వేళ, పార
వశ్యమందదె జగము గోపాలకృష్ణ!

ప్రేమశృంగారరసముల, వెల్లివిరిసి
వెలయు లీలాతనుస్ఫూర్తి, నలరినావు
గోపికల ప్రేమభక్తిగా, దాపినాడ
వెద్ది నీచేతగానిది ముద్దుకృష్ణ!

పాలవారాశి తెలిదీ నివాసమేడ
అల్లవైకుంఠమేడ వ్రేపల్లెయేడ
గొల్లవారల గోవుల, కూటమేడ
ఆలగాచుటయేడ గోపాలకృష్ణ!

చద్దిముద్ద చిక్కాలు బుజానబెట్టి
నెమలిపింఛంబు శిరముపైన మరబెట్టి

నాలదోలుచువని కేగునట్టి వింత
వేషమును జూడవలతు గోవిందకృష్ణ!
గోపికలతోడ చల్దులు గుడిచినావు
పెరుగుకుండల కుందూట్లు బెట్టినావు
యీడుచేడెల గోడిగాలాడినావు
పెద్దమనిషి వె నీవు గోవిందకృష్ణ!
ఉచితనవరసభావాల కూటంబుగ
మేటిశృంగారరసపు పెన్నీటి వరద
అలరునందందు వీరభయానకములు
భువనమోహన నీరూపు ముద్దుకృష్ణ!
కనకచేలకు చేలాప్తవినుతశీల
గానలోల సతీరాధికావిలోల
భక్తజన పరిపాల కృపావిశాల
మ్రోలగనిపింపు మొకసారి ముద్దుకృష్ణ!
విమల నిగమాంతమానస విహరమాణ
రాజహంసవు రాధామరాళ సహచ
రిష్ణుడవు, జిష్ణుడవు మహావిష్ణు దివ్య
మూర్తివే! యెల్లభంగుల ముద్దుకృష్ణ!
విమల కాళింది నీటిలో వింతదోప
కరుణ నక్రూరునకు నిపు గానుపించి
భక్తుల ఫలసిద్ధుజేసినవాడ వెట్లు
గొల్లలంగూడినావో ముకుందకృష్ణ!
విశ్వమోహన మొనరించు వేణుగీతి
గోపికల రాగరసమున గూల్చు నీవ
డెట్లు? వేదాంతబోధ గావించి పార్థు
బ్రహ్మవిదు జేసినావు గోపాలకృష్ణ.

వినుము వ్యత్యస్తపాదారవింద యుగళి
తీరుదోప నారాయణ తీర్థునెదుట
నిలచి సొగసుగ నృత్యంబు నేర్చికొనవె
మురువుదోచు కొత్తగా నీవు ముద్దుకృష్ణ!
భక్తపరిపాల రుక్మిణీ ప్రాణలోల
సాధువంచనశీల, నిస్సంగిజాల
పాలనవిలోల, విశ్వప్రభాలవాల
మ్రోలనొకసారి నిల్వరా ముద్దుకృష్ణ!
కఠిన కాళీయ ఫణిఫణాగ్రమున నిలచి
తాండవంబాడునట్టి నీ ధైర్యమరయ
మనుజమాత్రుడవనుచు నేమాత్రమేని
విశ్వసింపగలేము గోవిందకృష్ణ!

ఇంద్రయాగము మాన్పిన సాంద్రకోప
మడర నీవమేఘములగొని యమితవాన
గురియ గోవర్ధనము కేల గోటనెత్తి
భయము బాపితిగాదె! గోపాలకృష్ణ!

గోట గోవర్ధనము నెత్తుటేటి నిజము
చతురతను కనుకట్టు గట్టితివిగాక
మాయ లెరుగని వారది మహిమయనచు
మోసపోయిరి నీ మాయ ముద్దుకృష్ణ!

మాగధుని కాలయవనుని, మంటగలపి
దాస్యమున గుందునృపతుల, దండనిలచి
యాదవకులంబునకును విఖ్యాతిగొలిపి,
పుడమి రక్షించితివిగాదె! ముద్దుకృష్ణ!

(సశేషము)






# నేర్పరి

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

ఒక గ్రామములో రంగయ్య అనే మంగలి కలడు. వాడు పనితనములో బహునేర్పరి. కాని ఏం ప్రయోజనం? ఎంత నేర్పరో అంత త్రాగుబోతు.

ఇలా ఉండగా ఆ వూరి రాజుగారు రంగయ్యకు మరునాడు ప్రొద్దున్నే వచ్చి గడ్డం గీయమని కబురు చేశారు. మన రంగయ్య ఆ సంగతి పట్టించుకోక తప్ప త్రాగి చిందులు తొక్కుతూ తిరుగుతున్నాడు.

అక్కడ, రంగడు రాలేదని రాజాగారు మహా కోపగించుకొన్నారు. ఎంతకూ రాకపోయేసరికి విసిగి భోంచేసి నిద్రించబోతూ "రంగడు ఇంటికి రాగానే నావద్దకు లాక్కురండి" అని ఆర్డరు జారీచేశారు.

రంగడికి ఇక్కడ మత్తు వదిలేసరికి మధ్యాహ్నం దాటింది. భార్య రంగడితో "ఇంత ఆలస్యంచేశావు. నిన్ను రాజాగారేం చేస్తారో!" అన్నది.

"నీకేం భయంలేదు. నువ్వూరుకో" అని చెప్పి దర్జాగా వెళ్ళాడు రంగడు రాజుగారి వద్దకు. అక్కడ అందరూ ఇవ్వాళ్టితో రంగడి పని ఆఖరు అనుకుంటున్నారు.

రంగడు నమ్రతతో రాజుగారి గది ప్రవేశించి చూచేసరికి రాజుగారు నిద్రిస్తున్నారు. ఇంక జాగు పనికిరాదని రంగడు నిద్రపోయే రాజుగారికి తన అతి మెత్తనైన కత్తితో శుభ్రంగా గడ్డంగీసి వచ్చి వాకిట్లో కూచున్నాడు.

రాజుగారు నిద్రలేచిన వెంటనే "రంగడు వచ్చాడా, వస్తే లాక్కురండిటు వెధవని" అన్నారు కోపంగా.

రంగడు దణ్ణాలతో అడుగుపెట్టాడు లోపలికి.

"ఏరా గడ్డం గీయటానికి రమ్మంటే రాలేదేం. నిన్నేం చేస్తానో చూడు" అన్నారు రాజగారు.

"అదేమిటి మారాజా, మీ గడ్డం పొద్దునే గీశేగానే" అన్నాడు రంగడు.

రాజుగారు ఆశ్చర్యంగా అద్దంలో చూచుకుని, అసలు సంగతి తెలుసుకొని, నిద్రలో తనకు తెలియకుండా అంత సునిశితంగా గడ్డంగీసిన రంగడి నేర్పరితనానికి మెచ్చి అనేక బహుమానాలిచ్చి పంపాడు.

చూశారా! బాలలూ, తన వృత్తిలో రంగడికున్న నేర్పరితనం. అలాగే మీమీ రంగాలలో మీరూ నేర్పరులు కావాలి.

---

# చిలుకమ్మ పెండ్లి

రంగశ్రీ

చిలుకమ్మ పెండ్లి
చూడగా వచ్చి
చుట్టపక్కాలు
కుందిటూ జేర!

సొలెపురుగులు
పలువలు తీర్చె
సీతాకోకమ్మలు
పారాణి పూసె

(42వ–పేజీ చూడుడు)

# చీమల రాజ్యంలో శోభన తరుణం

(లిన్ పూల్)



చీమలరాజ్యం వింతగా ఉంటుంది. అసలు చీమల్లోనే 6000 రకాలకు పైగా ఉన్నవి. సెప్టెంబరు నెల వచ్చిందంటే చాలు, లక్షల సంఖ్యలో ఉండే ఈ రకరకాల చీమల్లోనుంచి రాణిచీమ (రెక్కల చీమల సంగతి) పోతు చీమ శోభన విహారానికి బయలు దేరుతాయి.

ఏటా ఈ తరుణం రాగానే ఉత్తరార్థ గోళంలో అనేక ప్రాంతాలలో ఈ రాణిచీమల కేళీ విలాసాలతో ఆకాశం కాపురు వేసిపోతుంది. ఈ చీమలకు ఈ ఆకాశ కేళిలోనే గర్భధారణ జరుగుతుంది.

పిక్‌నిక్ (వనభోజనాల)లకు బయలుదేరి కులాసాగా గడుపుదామని ఉవ్విళ్లూరుతుండే యాత్రికులు ఈ సెప్టెంబరులో ఈ చీమలు ఆకాశయాత్రలు రవి మించుకొంటే బాగుండును అనుకొంటుంటారు. ఎందుకంటే ఆకాశం అంతా అపహరించి ఉండే ఈ చీమలు కొన్ని వనభోజనాలు చేసుకొనే వారి పదార్థాలలో రాలిపడుతుంటాయి. మనం వద్దనుకొన్నా, కావాలనుకొన్నా వాటి విహారమేమో అవి మానుకోవు. వసంత ఋతువు ప్రారంభంలో మొదలయ్యే ఈ చీమల విహారం శరత్కాలారంభం వరకు సాగుతుంది.

ప్రతి చీమల రాజ్యం (కాలని)లో ఒక రాణిచీమ ఉంటుంది. ఆ రాజ్యం మొత్తానికి గ్రుడ్లు పెట్టేది ఇదొక్కటే. అంటే వంశోద్ధరణ అంతా ఈ ఒక్క రాణి చీమమీద ఆధారపడి ఉంటుందన్నమాట. ఈ గ్రుడ్లు పొదగబడి పిల్లలు పుట్టగానే వాటిని సాకే పని మిగతా ఆడ చీమలమీద పడుతుంది. ఇవి ఆడ చీమలేగాని వీటికి సంతాన శక్తిఉండదు. ఈ రాజ్యంలో చీమలన్నిటికి ఆహారం సేకరించి చేర వేయటం మరికొన్ని ఆడ చీమల పని. ఇవికూడా అటువంటి గొడ్రాళ్లు చీమలే. వసంతృత్వారంభం నుంచి శరదృత్వారంభంవరకు ఈ సంతానం త్వరిత గతిని కల్గుతుంది. చీమల రాజ్యాలు (పుట్టలు) నేల మీద, చెట్ల తొర్రల్లో, పూబంతుల్లో ఇట్లా ఎక్కడ బడితే అక్కడ వర్థిల్లుతుంటాయి.

సెప్టెంబరు నెలరాగానే ప్రతిరాజ్యంలోని రాణి చీమ అనేక ఆడచీమలను (సంతాన శక్తిగలవాటిని) అనేక మగచీమలను కంటుంది. ఇవన్నీ ఆకాశకేళీ అర్హత కలవి. వీటికి క్రమంగా రెక్కలు వస్తాయి.

ఈ తరుణం వచ్చేప్పటికి చీమలరాజ్యంలో పెద్ద సంచలనం బయలుదేరుతుంది. రాణి చీమ ఒక వైపు మొదలకుండా వేల సంఖ్యలో గ్రుడ్లు పెడుతుంటుంది. మిగతా చీమలన్ని అటూ ఇటూ విసుగూ విరామం లేకుండా తిరుగుతూఉంటాయి. అట్లా ఎందుకు తిరుగుతాయో వాటికే తెలియదు. రాను రాను ఉద్రిక్త వాతావరణం ముదిరిపోతుంటుంది. వడి పెరుగుతుంది. అదృష్టం పట్టిన చీమలు రెక్కలు విప్పుకొని సింహద్వారం గుండా తప్పించుకు ఎగిరి పోవటానికి ప్రయత్నిస్తుంటవి. అయితే, మంది మార్బలం చీమలన్నీ వాటిచుట్టూ చేరి పోనీయకుండా అడ్డుపడుతుంటాయి. రెక్కల చీమలు ఏమైనా సరే తప్పించుకు పోవాలని చూడటంతో సంఘర్షణ ప్రారంభమై సంగ్రామంగా పరిణమిస్తుంది.

ఇంతలో వైవాహిక తరుణం వచ్చేస్తుంది. ఈ ఆటంకాన్ని సహించజాలని పోతు, పెంటి చీమలు ప్రాణానికి తెగించి పోరాడి తప్పించుకు బయటపడి, ఆకాశంలోకి దూసుకుపోతాయి. చాల ఎత్తుకుపోయి అక్కడ విహారి వినోదంలో మునిగిపోతాయి, రాణి చీమలకు గర్భధారణ జరిగేవరకు ఈ ఆకాశ కేళి ముమ్మరంగా సాగుతుంది. ఈ ఒక్కసారి జరిగిన గర్భధారణలో రాణిచీమ అజన్మాంతం గ్రుడ్లు పెడుతుంది. (గర్భధారణ అంటే గ్రుడ్లు పెట్టే శక్తి వస్తుందన్నమాట)

మళ్లా ఈ తరుణం ముగియగానే ఎవరో చెప్పి ఆదేశించినట్టే మగ చీమలన్నీ భూమిమీదకు వ్రాలి పోతాయి. అట్లా పడిపోగానే కొన్నిటిని ఏ జంతువులో పక్షులో తినివేస్తాయి. అట్లా తినకపోయినా ఒక్క గంట కాలంలోనే ఈ పోతు చీమలన్నీ వాటికై అవి చచ్చి ఊరుకుంటాయి.

గర్భధారణ జరిగిన రాణి చీమలేమో భూమిమీదకు దిగివచ్చి సంతానోత్పత్తి కార్యక్రమం ప్రారంభిస్తాయి. రాణి చీమలుకూడా భూమిమీద పడగానే చాల వాటిని జంతువులో పక్షులో తినివేస్తుంటాయి. అట్లా తప్పించుకు బయటపడినవి ఏదో చోట మరుగు

చూచుకొంటాయి. రాళ్ళ క్రిందనో, రప్పల క్రిందనో, చెట్లలోనే, పుట్టల్లోనో మళ్ళీ కొత్త చీమల రాజ్యాల స్థాపన ఆ విధంగా ప్రారంభమవుతుంది.

భూమి మీదకు రాగానే రాణీచీమ చేసే మొదటి పని స్వయంగా తన రెక్కలను అది నరికివేసుకోవటం. ఇందుకు దీనికి వాడిగల కత్తివంటి అవయవాలు ముందు కాళ్ళమీద జన్మలో పుడతాయి.

ఆడ చీమ మరుగు ఏర్పరచుకోగానే గ్రుడ్లు పెట్టటం ప్రారంభిస్తుంది. దాని తొలిచూలు గ్రుడ్డును అదే తింటుంది. మలిచూలు గ్రుడ్లు పొదగబడతాయి. వీటిలో కూడా కొన్నిటిని తల్లిచీమ తిని వేస్తుంది. బ్రతికి మిగిలిన పిల్ల చీమలు పెరుగుతాయి. వాటికి చాలినంత తిండిలేక కరువు ఏర్పడుతుంది. అయితే ఒక్క కొత్త రాజ్యపు కొత్త రాణి చీమ పుట్టిన వాటిల్లో చాలినన్నిటిని బ్రతకనివ్వటం ద్వారా వీటికి పుష్టిగా ఆహారం లభిస్తుంది. కనుక రాజ్యంలో చీమానీకం అంతా పుష్టిగా పెరిగి బలపడుతుంది.

ఇట్లా శీతాకాలం గడిచిపోతుంది. అప్పటికిఎన్నో కొత్తరాజ్యాలు ఏర్పడి చీమ జనాభా పెరుగుతుంది. ఈ పాత, కొత్త రాణి చీమలు గ్రుడ్లు పెడుతూంటే గొడ్రాలు చీమలు పొదుగుతుంటాయి. రాణి చీమల ఆయుర్దాయం 15 సంవత్సరాలదాకా ఉంటుంది. అయితే జీవితం దినదిన గండమే. స్వరాజ్యంలో జరిగే అంతఃకలహాలు, పొరుగు చీమల దాడులు వీటన్నిటికీ తట్టుకొంటే మాట.

1960లో పుట్టిన కొత్తరాణి చీమలు, అదివరకు సంవత్సరాలలో పుట్టిన రాణులు గ్రుడ్లు పెడుతుంటాయి. వీటిలోనుంచి రెక్కలు వచ్చిన చీమలు ఆకాశకేళికోసం విరహవ్యథతో 1961 సెప్టెంబరు నెల రాకడకు ఎదురుచూస్తూ ఉంటాయి.

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౯౩

ఎపుడు, నామది, వసియించు, శ్రీరాముండు
రాముని సేవింతురక్తి నేను
రాముచేఁ బాతక రాశులు క్షీణించు
రామునికై - యహరహము వేతు;
రాముని వలన, ఘోరాములు నశియించు,
శుభములు బ్రాప్తించు క్షోణియందు.
రామునియందు, సుప్రేమ భక్తులు నాకు
కూడియుండెడి సదా వేడుకలర

రామదాసుఁడేను - ప్రేమతోఁగౌసల్య
ముద్దు తనయుఁడైన - మోహనాంగుఁ
డెపుడునన్నుఁబ్రోచు - నింపారు దయతోడ
భక్తినొసఁగి - వినయభావమొసఁగి

౯౪

కార్ముకమున, తీక్ష్ణశరములౌ శరము
లొప్పితో ధరియించి - యుద్ధరంగమున
భుజపరాక్రమముతో - భూరిశత్రువుల
గజిబిజి నొనరించు - కమలదళాక్ష!
చండాంశుఁబోలిన - సంగ్రామభీమ!
పుండరీక వరద! పుల్లాబ్జ నేత్ర!
దశరథనందనా! ధర్మైక హృదయ!
కుశలమొసంగవే! కువలయనేత్ర!

౯౫

మునులు, సిద్ధులునిన్ను సేవనమొనర్తు్రు;
పద్మదళనేత్ర! నీపాదపద్మములను
మల్లెదామరపూలఁ బూజింత్రుసతము?
సీతతోఁగూడియున్నావు; శీతభానుఁ
డును, రవియు-నేత్రములుగాగ-నినకులేశ!
చెలఁగినావు; సింహాసనాసీనుఁడగుచు
రాఘవా! రామచంద్ర! సుత్రామవంద్య!
నిన్ను సేవింతు సతతంబు - నీరజాక్ష!

౯౬

కరుణా స్వరూపుఁడై -ధరణి పాలకుఁడునై
స్తంభముల్ బోలు, భుజములు గల్గి
వీరుఁడై, ధీరుఁడై - విమలమనస్కుఁడై
దశరథకొమరుఁడై - దనరునట్టి
రఘువంశరత్నమై - రాక్షసులను ద్రుంచి
విజయంబు జేకొని - వెలయునట్టి
పొలుపారు గుణముల పూఁదోఁటయై-దశ
కంఠ, లుంఠనుఁడునై - కమల నేత్రుఁ

డైన, రామచంద్రునశ్రాంతమును భక్తి
భావమునఁ దలంచి ప్రార్థనంబు
సల్పుచుందు; దమము, శమముబ్రసాదించి
చిత్తశాంతి నొసఁగ శ్రీకరముగ

౯౭

జన్మములనేకములు గల్గె-జడుడనైతి;
వ్రతములందైనఁ దీర్థయాత్రలనునైన
యోగములనైనఁ బుణ్యంబులొందనైతి;
రాఘవా! నిన్నుస్మరియింప; రామనామ
మహిమఁదెలియగలేనైతి; మందుఁడైతి;
నిష్ఫుడైన, సీతాపతీ! యేస్మరించి

దాసదాసానుఁడగుచుఁ బ్రార్థనమొనర్తుఁ
గరుణతోఁజూడఁగదవయ్య కమలనయన!

౯౮

యోగ తేజస్సుచేనిండి - రాగసహిత
మైన, నేత్రంబు లొప్పారినట్టి మునులు
యే, మహాత్ముని సేవింతురెపుడు నట్టి
యోగిజనపాద కమలంబులోలిఁబట్టి
సతము సేవింతు, స్తుతియింతు, సంస్మరింతు;
రాఘవా! ఆలకింపవే! ప్రార్థనంబు

౯౯

రాహువు మ్రింగఁగారాదు; పగటిపూట
మలినుండుగాడు; యమ వసఁజిక్క
రాడస్తమయమొందరాదు; కళంకంబుఁ
బొందడెప్డు; ద్విపక్షమందుకూడ
శోభించు చుండును - శుభగుణంబులచేత,
చక్రవాళమును, భుజాబలంబు
గలిగి, దాటగలాడు- తెలుపు మొగమువాడు
తేజస్సుగలవాఁడు - దివ్యకీర్తి
చందురుండు, దోషమందడు; గుణసము
ద్రుండు, రామచందురుండు; సుగుణ
ఖనిని, కీర్తి చంద్రుగనె; పుత్రకునిగాగ
యట్టిరామచంద్రు - నాశ్రయింతు.

౧౦౦

భండరంగంబున - మొండెంబులాడెను
వేదండములు, బదివేలుసీగ్గె
లక్షగుఱ్ఱంబుల - భక్షించెను, యముండు
కాల్బంట్లు, యుద్ధరంగంబునందు
నూరుకోట్లకుఁజచ్చినారు; రక్షోమూక
కోట్లకునశియించె - కువలయమున
నెత్తుటేఱులు పాఱె; తత్తరంబులఁ జెంది
దివిజులు జెందిరి - దిగ్భ్రమంబు
రామ! ఘోరాతి ఘోరమై-రణముమీఱె;
నీ ధనుష్టంట శబ్దంబునింగి, నేల -
నిండెజామున్నఱయటన్న - భండనంబు
వర్ణనముసేయ, శ్రీరామ వశమొనూకు!

౧౦౧

ఇందీవరశ్యాముఁడినకులాభరణుండు
సంసార విపిన వృక్షములనెల్ల
కార్చిచ్చుకై వడిఁ గాల్చెడివాఁడు, పా
ర్వతికిఁ బ్రసన్నుఁడై - భావమందు
ఆనందరూపుఁడై - యలరెడివాఁడు; సం
సార, కష్టంబుల - సమయఁజేసి
భక్త జనంబులఁ బరిపాలనమొనర్చు
ఆర్తరక్షణుఁడు; మహామహిముఁడు
రామభద్రమూర్తి - రక్షించుమము సదా
మంగళములనొసఁగి - మహిత మూర్తి
జానకీప్రియుండు - సచ్చిదానందుండు
యతనిసేవసతము - నాచరింతు

౧౦౨

దేవతాళి దుఃఖంబు, దేదీప్యముగను
నాశనంబొనరించు, రమేశుఁడవు!
మనుజదేహంబుఁదాల్చిన - మాన్యుఁడీవు!
గొప్పయానంద రూపుఁడై కొమరుమిగిలి
హరిహరబ్రహ్మ మూర్తితో యలరుదీవు!
కరివరద! నిరాకార, సాకారుఁడీవు!
రామచంద్ర ప్రభూ! నిన్నురాత్రి బవలు
స్తోత్రమొనరింతు రక్షింపు శుభ్రచరిత

౧౦౩

శరణుజొచ్చిన వారికి సంతసంబు
నిండుగా నిచ్చినావు; కోదండరామ!
వారికిఁబ్రసన్నుఁడై నావు; వారియాధి
వ్యాధి, బాధలఁబోగొట్టి వఱలినావు;
వర, సుయోగీశ్వరులు, వారిభావమందు
నిన్ను సతతంబు ధ్యానింత్రునిష్ఠతోడ
స్నేహితుండు - సుగ్రీవుండునిఁ భజించె;
భక్తులెందఱో నీసేవవఱలినారు
నా, యుడుతభక్తిఁగైకొని నన్ను నీవు
మన్ననముసేయుమా - రామ-మాప్రి
యుండ!

(సశేషము)

# స్వీకారం

"రాఘవ"

(గతసంచిక తరువాయి)

కాని, 'బావ' యేమనుకొంటాడో అని జంకి వూరుకునేది. పార్వతి మాత్రం సీతాపతిచేత కోరికోరి ఒక వుత్తరం వ్రాయించగల్గేది. అందులో తన క్షేమసమాచారాల్ని, సావిత్రి చదువుసంధ్యల్ని గురించి, వగైరాలు, సవిస్తరంగా కాకపోయినా, ఒకమాదిరిగా వ్రాయించగల్గేది. అంతేగాని, తనకు తానై సీతాపతి యెన్నడూ ఒక్క వుత్తరం వ్రాద్దామనుకోలేదు మురారికి.

ఇలా మురారి వుత్తరాలు మామూలుగా వ్రాస్తూన్న సమయంలో, ఒకసారి, సావిత్రి స్వహస్తాక్షరాలతో కొన్ని ప్రశ్నలు తయారుచేసి, సుదీర్ఘమైన వుత్తరం వ్రాసింది మురారికి, జవాబు కోరుతూ. ఎంత కుతూహలంతో వ్రాసి పోస్టు చేసిందో, అంత ఆలస్యం నేటివరకూ అవుతూనే వుంది. తన పెళ్ళి స్థిరపర్చుకున్నా కూడా, తనడిగిన ప్రశ్నలకి మురారి సమాధానము లివ్వలేదు. కనీసం బాగోగుల్ని కోరుతూ కూడా వుత్తరం వ్రాయక పోయేసరికి సావిత్రి అలజడిపడింది – పూర్తిగా భయపడిపోయింది. 'తనెంత తెలివితక్కువ పని చేశాను' అని సిగ్గుపడింది. 'ఛీ' బావను అవమానించాననుకొంది. అతని హృదయాన్ని వున్నట్టుండి గాయపర్చాననుకొంది. కొన్ని నెలలవరకూ సావిత్రికి యిలాంటి ఆలోచనలు కలుగుతూనే వున్నాయి. తరువాత, తరువాత, ఆ ప్రస్తావన క్రమేపీ హృదయంలో అణగారిపోతూ వచ్చింది. తాత్కాలికంగా తల్చుకున్నప్పుడు మాత్రం ఆవేదన – బాధ - కష్టం కల్గి మనస్సంతా కకావికలంగా వుండేది. 'ఒకవేళ యిప్పటికైనా వుత్తరం వస్తుందేమో!'నని పోస్టుమేన్ వంక చూస్తూవుండేది. అప్పటికీ, యిప్పటికీ మురారినుండి యే వుత్తరమూ రాలేదు...

తిరిగి యీనాటికి, సావిత్రిలో, మురారిమీద వున్న భావం బంధం త్రెంచుకొని, మగత నిద్రనుండి మేల్కొంది. ఎలాగైనాసరే, తనజీవితంపట్ల జరుగనున్న అన్యాయాన్ని, అక్రమాన్ని, మురారికి తెలపాలనుకొంది. కాని, అందువల్ల ముందుముందు భవిష్యత్తులో మురారికి తనవల్లగాని, తనవల్ల తనకిగానీ ఏమైనా కష్టనష్టాలూ, నీలాపనిందలూ కల్గుతయ్యేమోనని కొంచెం వెనుకంజవేసింది. అక్కడికీ ఒకవారం రోజులు, తన తెలివితేటలన్నిటిని ఏకంచేసి, దీర్ఘంగా ఆలోచించింది. యెటూ దిక్కుతోచక కలవరపడింది.

ఈ మధ్యకాలంలో సీతాపతి ముచ్చటగా శుభలేఖలు అచ్చువేయించి ముహూర్తానికి ఒక పదిహేను రోజులు ముందుగానే, చుట్టాలకు, మిత్రులకూ, అందచేసాడు.

రోజులు దగ్గర పడుతున్నకొద్దీ సావిత్రిలో ఆదుర్దా – కంగారు – భయం హెచ్చుకాసాగినయి. ఒకవైపునుంచి పెళ్లిపనులు పూర్తికావస్తున్నాయి. ఇల్లు పెళ్ళికళ అలంకరించటానికి ఆట్టేకాలం పట్టే సమయంకాదు. కాని, సావిత్రిముఖంలో అంతవరకూ ఏకోశానా పెళ్లికళ వుట్టిపడకపోయేసరికి, పార్వతి గుండెలు గుభేలుమన్నాయి. సీతాపతి తీరికలేకుండా అటూ – యిటూ కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతున్నాడు.

శీతాకాలం ... ఒంటిగంట ప్రాంతం ... పోస్టుమేన్ మామూలుగా వచ్చాడు. ... సావిత్రి 'వుత్తరమేమైనా వుందా!' నడిగింది ... లేదని చెయ్యూపాడు ... ముఖంగోడవైపుకి త్రిప్పి చూసింది ... క్యాలండరు కనిపించింది. 'మురారినుండి వుత్తరం యిక రాదు' అని నిశ్చయించుకొంది... అప్పటికి మురారినుండి వుత్తరాలు వచ్చి సంవత్సరం పైచిలుకైంది.

ఉన్నట్టుండి గబగబా గదిలోకి వెళ్లి సావిత్రి తన పెట్టె తెరచి, మురారి ఫోటోను చేతుల్లోకి తీసుకొని

— "నీకు నేనేం ద్రోహం చేసాను బావా! యింతవరకూ వుత్తరం వ్రాయకుండా మానుకున్నావ్? పోన్లే ... ఆఖరిసారి నేనైనా వ్రాస్తాను ... శుభలేఖకూడా పంపుతాను ..."—అని తనలోతాను వుద్రేకంగా అనుకొని, కళ్లెర్రబడేటట్టు కుమిలి, కుమిలి యేడ్చింది. ఓదార్చటానికి పాపం ... మురారి ఫోటోలో చిక్కుకొనిపోయాడు ... లేకపోతే ఓదార్చేవాడో — యేంచేసేవాడో! ... మరి.

ఎలాగో తనకి తాను సంబాళించుకొని, కూర్చున్న చోటలోంచి లేచి, వంటింట్లోకి తొంగిచూసింది. కాంతమ్మ ఎండిన అప్పడాల్ని లెక్క పెడుతూ డబ్బాలో వుంచుతూవుంది. పార్వతి, కందిమున్ని కలుపుతోంది. యిదే సమయమనుకొని సావిత్రి, సీతాపతి డ్రాయరువద్దకు పోయి, చరాలునలాగి, శుభలేఖకట్టలోంచి ఒకటితీసి, వలయితపాలా బిళ్లల్ని లెక్కపెట్టి తీసుకొని, రెండుకవర్లనికూడా చేతబట్టుకొని, విసురుగా తనగదిలోకినచ్చి, తలుపు బిడాయించింది. ఒకకవర్లో మామూలుగా శుభలేఖపెట్టి, మరో కవర్లో వుత్తరంవ్రాసి పోస్టుచేద్దామనుకొంది ముందు కాని, అది మంచిపని కాదనుకొని, ఒకే కవర్లోనే శుభలేఖా, వుత్తరం వుంచుదామని నిర్ధారించుకొంది. తీరావుత్తరం వ్రాయాల్చొచ్చేసరికి ఎలా మొదలు పెట్టి, ఎలాపూర్తి చేయాలోతోచక తికమకపడింది. చివరకెలాగోవ్రాసి, పనిమనిషిచేత ఆనాడే, మూడు గంటలవుతూండగా, పోస్టు చేయించిందిమురారికి ప్రేమతో —.యించుక బాధతో.

ఏదో కేసునిగురించి తీవ్రంగా ఆలోచిస్తున్న ప్రభుత్వోద్యోగి మురారికి, అప్పుడే వచ్చిన, సావిత్రి వ్రాసిన కవరు చూడంగానే, విప్పకముందే, వెనుకటి విషయాలు లీలగాగుర్తుకొచ్చాయి. యిక ఆకేసుని గురించి ఆలోచించ బుద్ధిపుట్టలేదు. వెంటనే ఒక సిగరెట్ట్ ముట్టించి, తన ప్రయివేట్ గదిలోకి వెళ్ళిపోయి, ఫ్లాస్కులోని కాఫీనిమెల్లగా త్రాగుతూ, సావిత్రి వ్రాసినకవరుచించి, శుభలేఖని ముందు చదువుకున్నాడు. చదువుతున్నంతసేపూ, వెంటనే ఆశీర్వదిస్తూ వుత్తరం వ్రాద్దామనుకున్నాడు. తీరా చూస్తే ఒక వుత్తరం కనిపించింది. వెంటనే చదువ నారంభించాడు తాపీగా —.

ప్రియమైన శ్రీ మురారి బావకు —

......నా జీవితం నీవల్ల, తప్పకుండా సుఖపడుతుందనే యింతవరకూ ఆశిస్తూవచ్చాను ...నన్ను నీచరణదాసీగా యెంచుకుంటావని మనస్ఫూర్తిగా నమ్మాను ... అందుకనే సంవత్సరంక్రిందట ఒకనాడు నీకు సుదీర్ఘమైన వుత్తరంవ్రాస్తూ నా హృదయం లోని (మర్చి పోలేని)మాటని నీకు తెలియజేసాను... కాని నువ్వు ఆ నాటినుంచి యేమీసమాధానమివ్వకుండా వూరుకొని వున్నావు ... దాన్నిబట్టి నీకు నామీద మనసులేదని అనుకున్నాను ... నువ్వు నన్ను పూర్తిగా తిరస్కరించావనే భావించాను ... అయినా నాకో అనుమానం యింకావుంది ... యిప్పుడిక తెలియ పర్చినా వచ్చేనష్టమేమీలేదనేచెబుతున్నాను ... నేను నిన్ను హృదయ పూర్వకంగా ప్రేమించుకొని పెళ్ళిచేసుకుంటాననటం తప్పంటావా? బావా! అయిన వాణ్ణి యీ విధంగా కోరుకోవటం నావంటి మరదళ్ళకు భావ్యంకాదా! నేను నీ పాద సేవచేసి వరించటానికి అర్హతలేదా? పోనీ ఆసక్కారం కూడాలేదా? అవును. లేదనేగా యింతవరకూ వుత్తరం వ్రాయకుండామానేశావ్ ... దాని అర్థం యిదేగదూ! పోన్లే ... యికనువ్వేమీ నన్నుగురించి వ్యథపడకు; యింతవరకూ నీ వల్ల నాకూ — నావల్ల నీకూ ఏం జరిగింది ... యిప్పుడే మనుకున్నాకల్గే లాభం ఏమీలేదు. నువ్వునన్ను అన్యాయంచేసావని, అపార్థంచేసుకున్నావని, బాధించావని యేమీ అనుకోవటంలేదు. ప్రయోజనం లేదుగనుక. ... ... కాబట్టి, కుమిలి పోయే నాహృదయానికి ఏమని సమాధానం చెప్పుకోవాలో తెలియక యీ వుత్తరం వ్రాస్తున్నాను. నా జీవితం పట్ల యెవరికే బాధ్యతా లేకపోయినా, నేనునీకు మరదల్నికాకపోను ... నువ్వు నాకు బావవికాకపోవు ... భార్యనై నీచరణ దాసినై - నీజీవిత భాగస్వామినినై - బ్రతుకుని కడ తేర్చుకోవలసిన నేను. యికనుంచి నీ దృష్టిలో 'మరదలు సావిత్రి' గానే వుండిపోదల్చుకున్నాను. యావజ్జీవితం నీ దృష్టిలో అలావుంటూ బ్రతుకుని సాగిస్తూ, చచ్చిపోవటమే కడకు యీ వుత్తరంద్వారా కోరుకొనేది నిన్ను. కాని, నా దృష్టిలో నువ్వు ఎలా వుంటూ వుంటావో తెలుసా! యిప్పుడు చెప్పను ... స్వయంగా నిన్నుచూడటానికి, చచ్చేలోపుగా ఒక సారి తప్పకుండా వస్తా. అప్పుడు ముచ్చటగాచెప్తాను ...అంతవరకూ నన్ను గుర్తించుకొంటూవుండు ...

...నాప్రారబ్ధంవల్ల నేనుపరాయిదాన్నవుతున్నా నాకున్నదికూడా మీకున్న హృదయంలాంటిదే. మీకున్న అభిరుచులేవున్నాయి ... మీకున్నకోరికలే వున్నయి ...యింతవరకూ నిన్ను 'నీ' అంటూవచ్చి,

మధ్యలో 'మీ' అన్నాననివ్యంగ్యంగా తల్చుకోకు ... నువ్వు పరాయివాడివని ఎంచుకొని అన్నానని అనుకోకు. ఎందుకో చివరకి గౌరవంగా సంబోధించాలనిపించింది. అన్నాను. అంతే ... పోతే ... ఒక్క మాట ... ఒక్క తీయనికోర్కె ... ఒకజాలి గుండెలోని బాధయొక్క బావ ... ఒక్కటేఒక్క బిక్ష ...

...'నిన్ను దైవసాక్షిగా ప్రేమించినందుకు పెళ్లి చేసుకోలేక పోగా, పరాయివాడికి భార్యనవ్వా అవుతున్నాను ... ఎలా అవుతున్నానో ఒక్కసారి నా ముఖంచూసి వెళ్ళిపో పెళ్ళి పీటలమీద' అంతే... ఆఖరికి నిన్ను ప్రార్థించగల్గేది ... తృణీకరించబడిన నీ పరితప్తహృదయిని -

— 'సావిత్రి'

'ఇప్పుడేంచేయాలి?' — అని తనలో ప్రశ్నించుకొన్నాడు మురారి. కర్తవ్యంతోచలేదు. వెంటనే కూర్చున్నవాడల్లా లేచి, గదిలోంచి బయటికొచ్చేసి, చేతిలో వుత్తరాన్ని జేబులోకి దూర్చేసి, ఆకాశం వంక తేరి పారచూశాడు. ఏ ఆలోచనా స్ఫురించలేదు ... గబగబ మెట్లముందువున్న జీప్‌ని స్టార్ట్ చేసి, శరవేగంతో, సెంట్రల్ జైలుమీదుగా కోటవెనుకవైపుకి వెళ్ళి, ఒకచోట కారు ఆపి, తాను బోయి వేరొకచోట స్థిమితంగా కూర్చొని, సావిత్రినిగురించి తర్జనభర్జన చేసుకోసాగాడు. గత్యంతరం కనిపించలేదు. తన్నుదానెన్నిసార్లో నిందించుకున్నాడు ... ఎంతగానో వాపోయాడు. తనమూలంగా సావిత్రి యిలా అయిపోతుందని కలలోకూడా తల్చలేదు. ఆ నాడు సావిత్రివేసిన ప్రశ్నలకు జావాబులిచ్చివున్నట్లయితే, యీ నాడు సావిత్రి తనకు మరదల్లా మారి 'భార్య' అయ్యేది. 'మేనరికంవదులుకున్నావేరా మురారి!' అని బంధువులంతా, తీరా పెళ్ళికి వెళ్ళినపుడు అడిగితే ఏమని సమాధానం యివ్వాలో! ఎలాలోకాన్ని నమ్మించాలో! అని పరిపరివిధాలుగా వూహించుకోసాగాడు.

అప్పటికి బాగా చీకటిపడింది. తనకోసరి వంటవాడు ఎదురుచూస్తూంటాడేమో పాపం! అని వెంటనే బయలుదేరి యిల్లుచేరుకొన్నాడు. అనుష్ఠాలన్నీ ముగించుకొని అసంతృప్తిగా యెంగిలిపడ్డాడు ... వంటవాడు ఆ నాడు ఎన్నడూపడని ఆశ్చర్యం పడ్డాడు ... 'అయ్యగారి తిండి యీనాడెందుకో తగ్గింది' అని చింతించాడు. బహుశా! తనవంటేమైనా బాగుండలేదేమోననుకున్నాడు ఆరోజున ...

రోజూ పదిగంటలవరకూ యేదో విధంగా ఆఫీసు పనిచూసుకుంటూ—రకరకాలైన కేసుల్ని గురించి ఆలోచిస్తూవుండే మురారి ఆనాడు కేవలం సావిత్రిని గూర్చి ఆలోచించటం మొదలెట్టాడు, వింతభావాలు ఎన్నో కలిగి విడదీయలేని చిక్కుసమస్యలు మురారిని కల్లోలపర్చసాగినయి ... ఇంతకీ 'సావిత్రికి వుత్తరం వ్రాసి — పెళ్ళికెళ్లకుండా మానుకోవడమా? లేక, పెళ్లికెళ్లి, సావిత్రిని మరింతగా యేడ్పించిరావటమా? యేదిచేయతగ్గపని ... యేదికాని కల్లనది ... మురారికి పరిష్కారణ కొచ్చినయి ఆఖరికి. "ఇంతగా పరితపిస్తున్న సావిత్రి పెళ్లికి యెలాగో వెడతాను ... అంతవరకూ బాగానేవుంది ఆలోచన. తరువాత యేంజరుగుతుందో ... ఎలా చెప్పటం? తీరావెళ్లాక నన్నుచూచి, తనఅభిప్రాయాన్ని వక్రంగా మార్చుకొని, యే నూతిలోపడటమో, యేకొరివి దగ్గరకన్నా పోయి గుడ్డలంటించుకోవటమో, లేక, యే విషమైనా యెవరుచూడకుండా త్రాగటమో! జరిగితే, అప్రతిష్టితనకేముందువస్తుంది. యీ కాలపు ఆడపిల్లలు యేంచేసినా హఠాత్తుగా చెయ్యగలరు? తీరా జరిగినతరువాత చేసేదేముంది? నన్ను నేను అప్పుడు ఎంత తిట్టుకున్నా ప్రయోజనంలేదు ... కాబట్టి నేను వెళ్లటం అంత భావ్యంగాదు ... మంచిదీగాదు. అలాంటప్పుడు వుత్తరంవ్రాసి యెంతగా సావిత్రిని ఓదార్చగలం? ఏమనివ్రాయటం? అలా వ్రాయటం యికతనకి మర్యాదకాదనుకున్నాడు..." —ఇలా ఒక నిర్ణయానికొచ్చి, సావిత్రిని మనస్ఫూర్తిగా తల్చుకొని, అర్ధరాత్రిదాటుతూ, దాటుతూండగా అశ్రుపూరితమైన కళ్లతో 'ఆనందంగా వుండమని' దీవించాడులోలోపల.

5

'సావిత్రి పెళ్లి' - సీతాపతి, కాంతమ్మల దృష్టిలో సుఖాంతమైంది. పార్వతి దృక్పథంలో విషాదాంతమైంది.

మురారి, తీరా, రాకపోయెసరికి సావిత్రికి, తన ఆత్మమీద తనకెంత గట్టినమ్మకంవున్నదీ తెలిసిపోయింది. అందరిలాంటి మనస్తత్వం మురారిదికాదనుకున్నందుకు మంచి ప్రాయశ్చిత్తమే జరిగిందని నుదురు బాదుకొంది. సూత్రధారణ జరిగేంతవరకూ మురారికోసం పెళ్లిపందిరంతా కలయచూసింది.

(సశేషము)

# సంక్రాంతి

'రంగశ్రీ'



జియ్యరుదా నేతెంచి
హరికీర్తనలు వినిపించి
వేకువనే మేలు కొలిపి
ఆశీసులిచ్చి మెదనిలిపి

గృహప్రాంగణము శుద్ధిజేసి
రంగవల్లులు తీర్చి దిద్దినారు
గోమయంతో గొబ్బిలు జేసి
తారకల భాతి నిలిపినారు.

ఇంటింటికీ అరుగుదెంచి
గంగి రెద్దుతల పంకించి
సంతసమ్మున ఆడింది
సంక్రమణగీతి పాడింది.

ఏడాది కష్టమ్ము పండి
సిరులతో గేహమ్ము నిండి
రైతులానందములో తేలి
రంజిల్లుచున్నారలే సోలి.

ముక్కోటి గళాలను మీటుతు
నూతన వత్సరానికి దాటుతు
అరుగుదెంచెనహో సిరి సంక్రాంతి
అగుపించెనహో నవ ప్రశాంతి.

---

ఒక పెద్దమనిషి బనియనుతొడుక్కోని, నడుచుట్టూ ఒకతుండుగుడ్డ కట్టుకోని ఒక కాఫీ హోటలులో ప్రవేశించి బల్ల ముందు కూర్చున్నాడు. అతని వాలకం, దుస్తులు చూచిన హోటలు యజమాని పలహారాల వడ్డనచేసేవాణ్ణి పిలచి ఆవ్యక్తిని చూపిస్తూ "ఆయనతో యిది క్షౌరంచేసే స్థలంకాదని కాఫీ హోటలని అర్థమయేటట్లు మర్యాదగా చెప్పు" అన్నాడు.

ఆ సర్వర్ నేరుగా వెళ్ళి అతనిని "ఏమండీ ముఖక్షౌరమా! క్రాపా" అని వ్యంగ్యంగా అడిగాడు

'సిపిసి'

# అనసూయ

(స్త్రీలకు ప్రత్యేక నాటిక)

మూలము :
స్నుషా విజయము

అనుసరణ :
"వేద"

<u>పాత్రలు</u>

**పురుషులు**

1. కామయ్య, 50 సం॥
2. రఘు, 25 సం॥

(ఈ రెండు పురుష పాత్రలను స్త్రీలే ధరించవచ్చును.)

**స్త్రీలు**

1. శాంతమ్మ, 45 సం॥
2. అనసూయ, 20 సం॥
3. లక్ష్మి, 20 సం॥
4. సీతమ్మ, 45 సం॥

## నాటిక పరిచయము

నాటిక కథాంశమంతయు కామయ్య గృహమందే జరుగును. కామయ్య గృహయజమాని, సనాతనుడు, వేషభాషలు తదనుగుణముగనే నుండును. అతని భార్య శాంతమ్మ. ఆమె స్వభావము పేరునకు విరుద్ధము. తనమాటే నెగ్గవలెననును. తన కూతురగు లక్ష్మిని ప్రేమించుచు కోడలగు అనసూయను ద్వేషించుచుండును. తల్లికి తగిన కూతురు, అత్తింటినుండి నెట్టబడి పుట్టింట స్థిరమయినది. కామయ్య కుమారుడు రఘు సాక్షాత్ రఘురాముడే. తల్లిదండ్రుల మాట దాటనివాడు. అతని భార్య అనసూయ సుగుణరాశి. దుష్టులైన తన అత్త, ఆడబిడ్డ, మరది, దుశ్చర్యలకు తట్టుకొనుచు సీతమ్మ సహాకారమువలన చివరకు ఇంటి పెత్తనమును వహించును. పొరుగింటి ఇల్లాలు సీతమ్మ, శాంతమ్మ ప్రాణస్నేహితురాలు. ఈమెవలననే వీరి కాపురము బాగుపడును.

## "అనసూయ"

స్థలము:- కామయ్య గృహము

(తెరలో - బజారులో జనుల కలకలము, బండ్ల చప్పిడి, వ్యాపారుల కేకలు, జంతువుల అరుపులు వినబడుచుండును. మరియు రెండు ఆడగొంతులిట్లు మాట్లాడుకొనుచుండును.)

ఒక గొంతు:-దుష్టులైన అత్తమామలు గుణవంతురాలైన కోడలిని తన కుమారునితో కాపురం చేయనీయరల్లెయుంది ఈ లోకంలో!

రెండవ గొంతు:_ఆమాట నిజమేలె! ఈ ఊళ్ళో చూడు. అపరకాళిక శాంతమ్మ తన కోడల్ని పెట్టే బాధలు ఇంతింత కాదే! ఆమె కోడలు చాలా మంచిదట.

శాంతమ్మ:-(తెరలో) ఎవరే!! వాళ్ళు! నా జోక్యం మీకెందుకే? మా ఇంట్లో మేమెట్లా చస్తే మీకేం?

మొదటి గొంతు:-అదిగోనే శాంతమ్మ మన మాటలు విని మండిపడుతున్నదే! మనకెందుకులే పద!

(తెర లేచును)

శాంతమ్మ:-(తన ఇంట్లోనుండి కోపముతో వచ్చి తిరుగుచు) ఎవరే!! వాళ్ళు! అరె! అరె! నేను వాకిట్లోకి వచ్చేలోపలే వెళ్ళిపోయారే! (దుఃఖంతో) అయ్యో! రామచంద్రా! ఇట్లా నేను ఈ లోకం నోట్లో నానటం నా కోడలు మూలకంగ కదా! దాని దుంపతెగ ...(అని తిటుతూ మెటికలు విరుచును.)

కామయ్య:-(ఇంట్లోనుండి కోపంతో) ఓసేవ్! నీ తప్పెడితనాన్ని నీవు తెలిసికోకుండా, పైగా తిడుతున్నావా?

శాంతమ్మ:-(తెరవైపు చూచి) అయ్యో! మా ఆయన కాబోలు నామాట విని కోపంతో వస్తున్నాడు.

కామయ్య:-(ప్రవేశించి) ఓసే! మొద్దూ! ఇక నీవు బుద్ధికలిగి కోడలికి లొంగివుండు.

శాంత:_అదేమిటి!! తాళిబొట్టు కట్టిన నీకే లొంగని నేను ఎవతెకో పరాయివానికి ఎట్లా లొంగుంటా ననుకున్నావు?

కామ:_ఏమిటే వాగుతున్నావ్! నాకు మూడు వేదాలు, ఆరు శాస్త్రాలు లొంగినయ్. అఖరకు

చక్రవర్తి గూడా దాసానుదాసుడయినాడు. నీవొక లెక్కా జమా ?

శాంత:-పోనీ ! తాళిగట్టినందుకు నీకు లోబడియున్నా ఒక ఇంటినుండి నా కాళ్ళ దగ్గరకు వచ్చిన ఎవతెకో లొంగి ఉండమనే మాట నా చెవిని పడకూడదు.

కామ:_(శాంతించి) ఓసి ! తెలివితక్కువ పెద్దమ్మా ! నేనొక మాట చెపుతా విను. కుటుంబపోషణలో కొడుకు సమర్థుడయితే కోడలు సమర్థురాలే. కనుక వృద్ధులైన తల్లిదండ్రులు వాళ్ళకు అనుకూలంగా ఉండటం ఎప్పటికైనా మంచిది.

శాంత:-అది వల్లకాదు. కావాలంటే దబ్బుపోసి కొని తెచ్చినదానికి నీవే అడుగుమడుగు లొత్తు. నేను మాత్రం చస్తే లొంగను. ఎన్నాళ్ళనుండియో ఈ ఇంటికి యజమానురాలుగా వుండి దానికి లొంగుతానా? ముందొచ్చిన చెవులకన్నా వెనుక వచ్చిన కొమ్ములు పెద్దవా ?

కామ:_ఏమ్ ! ఇట్లాంటిదానివి మొదట్లో ఇరుగు పొరుగు పెళ్లైన పిల్లవాండ్లను చూచినప్పుడల్లా బొడ్డూడని మనవాడికి కూడా ఎప్పుడు పెళ్ళి చేస్తారు ? ఎట్లాంటమ్మాయిని తెస్తారు ? అని అఘువరించావ్; ఇంకా ఎన్నోఎన్నో అన్నావ్.

శాంత:-ఆమాట నిజమే ! ఎందుకనో అప్పుడలా మేలని తోచింది అన్నాను. ఇప్పుడు మాత్రం కోడలికన్నా విషమే నయంగావుంది.

కామ:-(స్వగతం) ఆహా ! కాలమహిమ ! అమృతం కూడా విషమయినదే ! దీని దుంపతెగ ! పాపం. ఏయమ్మ కడుపునో పుట్టి ఈ ఇంటికి వచ్చి వంశాధారమై పితృదేవతలకు తిలోదకాలిచ్చి తరింపచేస్తున్న కోడల్నే విషంగా తలుస్తుంది. ఇక ఈ దుర్మార్గురాలు ఎంత బ్రతిమాలినా నా మాట వినదు. భార్యమాట వింటే కోడలు శత్రువవుతుంది. కొడుకును విముఖుడవుతాడు. కోడలి మాట వింటే ఇది నోటికొచ్చినట్టల్లా వాగి నానా మాటలు అంటగట్టుతుంది. అందుకని గోడమీద పిల్లిలాగా కాలం గడుపుతా. చివరకు నా ఖర్మ ఇలా కాలింది. (అటునిటుచూచి) అదిగో ఆ వచ్చేది సీతమ్మల్లే వుంది. ఆమె నిజంగా సీతాదేవే ! ఆమె మా భార్యకు సహవాసకత్తె యని ఇందాక ఆమె ఇంటికి వెళ్ళి బ్రతిమాలుకున్నా. "నీవన్నా నా భార్య మనస్సును సరిదిద్దవమ్మా నీకు పుణ్యం ఉంటుంది" ...అని. అందుకనే ఇక్కడకు వస్తున్నట్లుంది. ఇక నేను పోతా. (వెళ్ళును)

సీతమ్మ:_(నవ్వుతూ ప్రవేశించి) ఏమే శాంతమ్మా ! కులాసా !

శాంత:-ఏమే సీతమ్మ తల్లీ ! నీకోసం చూచిచూచి కళ్లు కాయలుకాచి పోతున్నవే ? నే పడేపాట్లు చెప్పకోవటానికి నీవుతప్ప ఇంకెవరున్నారు చెప్పు ?

సీత:-ఏమిటే ఆ పాట్లూ ?

శాంత:_అట్లా అడుగూ చెప్పతా ! కనబడిన దేవతకల్లా మ్రొక్కి- ఎన్నో వ్రతాలు చేసి ఎట్లాగో ఒక కొడుకుని కన్నానా ! _ అదంతా నీకు తెలుసుగా, సంతానంకొరకు ఎంత తిప్పలు పడ్డదీను ?

సీత:-అవునే ! ఎంతో పుణ్యం చేసుకుంటేనేగాని నీకు అట్లాంటి పుత్రుడు పుట్టడు.

శాంత:-వాడికేం మహారాజు ! వాడ్ని అన్నవాళ్ళు పురుగులు పడిపోతారు.

సీత:_(స్వగతం) ఓసి నీ దుంపతెగ కోడలిమీద దుమ్మెత్తటానికి దారితీస్తుంది ? (ప్రకాశం) ఇంకెవరే నీకు కష్టాలు కలిగించేది ?

శాంత:-ఎవ్వడు ? అని అనకు. ఎవ్వతె ? అని అను.

సీత:_అయితే నీ కూతురటే ?

శాంత:_అయ్యో పిచ్చితల్లి ! అట్లంటావేమ్ ? నా కూతురెంత మంచిదో నీకు తెలియదటే. నేను చెప్పేది అదికాదు. కొడుకుకోసం కనబడిన ఊరల్లా వెళ్ళి ప్రతిగడప త్రొక్కి ఏరికోరి తెచ్చుకొన్న మా కోడలుబొందె, చివరకు నా హృదయానికి శల్యమయింది.

సీత:-పాపం అదేమి చేస్తున్నదే నిన్ను.

శాంత:-ఏమని చెప్పను ? నేను రహస్యంగా తలనూనె దాచిపెడితే నేను లేకుండా చూచి గబగబ వెళ్ళి దాన్ని కాస్తా జుట్టుకు రాచుకొంటుంది. ఇంక సాయంత్రం కావటమె ఆలస్యం_ఎక్కడనుండి తెస్తుందో ఘుమఘుమలాడే జాజిపూవులు తెచ్చి సిగకు చుట్టి మొగడి దగ్గరకు కులుకుతూ వెళ్లుతుంది.

సీత:-మంచిదే. చేయవలసినపనే చేస్తుంది. నీకేం ఇబ్బంది ?

శాంత:_అట్లంటావేమిటే ! అదంతా మొగుణ్ణి లోబరచుకోవటానికే గదుటే చేయటం.

సీత:_అవును లోబరుచుకోవటం మంచిదేగా ?

శాంత:_నీవూ బలేదానివేనే ! మా అమ్మాయి అత్త

వారింటికెళ్ళి తన మంచిగుణాల్తో మొగుణ్ణి వశపరచుకోటానికి చాలా కాలం ఎంతో పాటు పడింది. వాడు వశమయినాడా? వాడు తల్లిమాట, చెల్లెలుమాటే వింటాడుగాని నా కూతురు వశంకాలేదు. నా కొడుకు ఆడదానికి లొంగిపోతుంటే నేను సహిస్తానా? చెప్పు. దాన్ని చూచన్నా నేర్చుకోనవద్దూ!

సీత:-(స్వగతం) ఈ దుర్మార్గురాలు అకారణంగా కోడలితో పోట్లాట పెట్టుకొంటుంది. (పైకి) ఆ తరువాత.

శాంత:-నా అదృష్టంకొద్దీ నా అల్లుడు నా యింటికి వస్తే అతణ్ణి ఎట్లాగయినా వశపరచుకోవాలని గడ్డపెరుగు తెప్పిస్తే దానిని నా అజ్ఞ లేకుండగ మొగుడికికూడ వేసిపెట్టింది.

సీత:-అవునమ్మా అల్లుడికి వేయగా మిగిలినదే మొగుడికి వేసిందేమో - తప్పేముంది?

శాంత.-ఎబ్బెబ్బే! నీవు సరిగ్గా వినలేదు. తప్పని కాదు నేనటం_నా అజ్ఞ తీసుకోలేదంటున్న.

సీత.-సరే! ఆతరువాత.

శాంత:-ఆరాత్రి అల్లుడు, కూతురు పడుకుంటారని మంచిగాలివేసే గదిలో పక్క వేశాను. తాను, భర్త కలిసిపోయి ప్రొద్దుకూకకముందే వెళ్ళి ఆ పక్కమీద పడుకున్నారు.

సీత:-అదే! నీ కొడుకు నియమంగా పడుకొనే చోటేమో!

శాంత:-నియమమూ! అయితే మాత్రం గౌరవించదగిన అల్లుడు వస్తే ఆరోజుకు ఎక్కడో ఒకచోట పడుకోనక్కర్లా? కానీ వాడిలా దోషంలేదు. ఈ దుర్మార్గురాలే వాణ్ణి కనుసైగచేసి పిలుచుకెళ్ళింది.

సీత:-ఇంకొకటి మంచి గది ఉన్నదిగా దాంట్లో పక్క వేయకపోయినావా?

శాంత:-చాలుచాల్లె! నా కూతురు పడుకోవాలని అక్కడ వేశాను.

సీత:-అదికాదోయ్ శాంతమ్మ! నీకు కోపంగాదంటే నేనొక మాట చెపుతా.

శాంత:-చెప్పు.

సీత:-కోడలు భర్తతో మంచి అందమైన గృహంలో ... మంచి గుణవంతుడై, కులాన్ని ఉద్ధరించే మనుమడు పుడతాడని శాస్త్రం.

శాంత:-(కోపంతో) ఏమిటేమిటీ! నా కూతురుకి సంతానము కలగకముందు దీనికి కలిగితే నేనెట్లా చూస్తాను?

సీత:-ఇందుకా కొడుకునకు కోడలికి కాకుండా చేస్తున్నావు! చెడగా చెడగాగాని కాపురాలు కావు అంటారు.

శాంత:-చాల పొరపడుతున్నావు సీతమ్మ! పురుషునకు స్త్రీతో ఎక్కువ సాంగత్యముంటే వేడిచేత రోగమొస్తుంది. కోడలు గర్వించి అత్తమామల మాట వినదు. అందుకని ఎక్కువగా అబ్బాయి దగ్గరకు వెళ్ళకుండా చేస్తున్నా.

సీత:-అట్లయితే! నీ అల్లునకుకూడ ఎక్కువ స్త్రీ సంబంధముచేత రోగమొస్తుందేమో పాపం! అట్లయితే నీ బోటిది కూతురు అల్లుడుతో కాపురం చేయటానికి కూడా ఇష్టపడదు.

శాంత:-నీకా విషయం దేనికే ఇపుడు?

సీత:-(నవ్వుతూ) సరే! సరే! అపైన.

శాంత:-ఇంకా ఇది తన తండ్రిగాని తోబుట్టినవాడు వస్తే రకరకాలు పిండివంటలువండి పొట్టలు విచ్చేటట్లు పెట్టి వాళ్లున్నన్నాళ్లు సంతోషంతోనుండి వాళ్ళు వెళ్లగానే ఏడుస్తూ నట్టింట్లో కూర్చుంటుంది.

సీత:-శాంతమ్మ! క్రొత్త కోడలికి ఇది స్వభావమేగా?

శాంత:-అబ్బెబ్బె! నా కూతురిట్లాంటిది కాదమ్మా!

సీత:-ఇంతకన్నా ఎక్కువనే చెప్పు. ఆ తరువాత.

శాంత:-దీనికి ఇంకొక కారణంకూడ ఉన్నది. నా బిడ్డ అక్కడ తోడికోడలు ఆడబిడ్డల మధ్య సతమతమైపోతుంది ఏమనుకున్నావో సీతమ్మ తల్లీ! నా బిడ్డ ఎంత ఓర్పుతో చాకిరిచేస్తున్నా ఆ వెంకికొయ్య అల్లుడు తన తల్లి మాటలువిని మా అమ్మాయినే తిడుతాడు. దాని తోడికోడలు మొగుణ్ణి వశంచేసుకొని ఆడబిడ్డను కూడా లోబరచుకొని మా అమ్మాయిని దుమ్మెత్తిపోస్తుంది. ఇక నేను బ్రతకలేనమ్మా దేంట్లోనైన పడిచస్తే బాగుండును (ఏడ్చును)

సీత:-అదేమిటి అట్లంటావు? వదిన చెడ్డదయితే ఆడబిడ్డ దానివశం ఎట్లయిందే? అసలు లోకంలో ఆడబిడ్డలకు వదినలకు పచ్చిగడ్డివేస్తే మండిపోతుందే! ఎంతో మంచిదైతేగాని వదినయందు ఆడబిడ్డలకు స్నేహం కుదరదు. ఆడబిడ్డ మంచిదయితే వదినకు ఆమెయందు స్నేహం కుదురుతుంది.

శాంత:-నిజం చెప్పావె సీతమ్మ! అబ్బ! నా ఆయుస్సుకూడా పోసుకొని నూరేళ్లు బ్రతకవే! ఇక్కడకూడ తన వదినలో ఉన్న దుర్గుణాలే చూసి మా అమ్మాయి అదిఅంటే మండిపడుతుంది.

సీత:-ఆమాట త్రిప్పికూడా అనవచ్చుగదా!

శాంత:-అదెట్లా అట్లంటావు? అయితే చెప్పుతావిను. ఒకరోజున నా బిడ్డ అత్తగారింటినుండి వస్తే ఈ దుర్మార్గురాలు మొహం మూడువంకర్లు చేసుకొని తలెత్తకుండగనె "అంతా బాగున్నారా?" అని ఏదో పనివంక పెట్టుకొని దగ్గర నిల్చోన కుండ పోయింది. ఇంకొక మాటంటే నోటి ముత్యాలు పడిపోతాయనా!

సీత:-నీ కోడలు ఎంతో మంచిది గనుకనే అంత మాత్రమైన అడిగింది. నీ కూతురయితే మాత్రం పుట్టింటికి వచ్చిన ఆడబిడ్డను చూచి "నేను బహిష్ఠునైనా నంటూ మొహంకూడా తప్పించేది."

శాంత:-అది నీకెట్లా తెలుసు?

సీత:-నీ కడుపున పుట్టిందికదుటె?

శాంత:-అయ్యో! నేనటువంటిదాన్నా?

సీత:-నీవటువంటిదానివి కాకపోతే ఏమాత్రం దయ అనేది లేకుండా అటువంటి బంగారు బొమ్మను రాచి రంపాన పెడతావా?

శాంత:-అదంటే అంత పక్షపాతమేమె నీకు! అయితే ఇంకొకటి చెపుతావిను. మా చిన్నబ్బాయి మోహనుని ఎరుగుదువుగా - వాడు ఎంత మంచివాడు. వాడి పొడంటేనే గిట్టదు దానికి?

సీత:-నిజానికి అది సంస్కృతం చదువుకున్నందుకు జ్ఞానంకలిగి ఎంతో ఓర్పుగల బిడ్డ గనుక ఎప్పుడూ తనమీద పితురీలు చెప్పుతూ కయ్యంపెట్టే మరిదిని ఇంట్లోనుండి వెళ్ళగొట్టకుండా వున్నది. వాడంత దుర్మార్గుడు పుట్టడు పెరగడు. వాడేమో అన్నాట్ట. దానికది కోపంపడిందట, అప్పుడినుండి దాన్ని ఒకటే నిందించటంపైన.

శాంత:-చాలుచాల్లె నీకు బుద్ధిలేక దాన్ని వెనుకవేసుకొని నా బిడ్డను నిందిస్తున్నావు.

సీత:-(నవ్వుచు) అవును. వాడవాడ మోగుచున్న నీ గుణాలు ఎవరు ఎరుగరని. మరల ఆ కైకేయివై ఇట్లా పుట్టావు నిజంగా.

శాంత:-(ఏడ్చుచు) ఓసి దుర్మార్గురాలా! ఏనాటి శత్రువవో నా యింటికి కోడలిగావచ్చి చివరకు నన్ను స్నేహితురాలిచేత కూడ ఆ పాడు కైకేయితో పోల్పించావు. అయ్యో! అయ్యో! ఇంకేమున్నది (అని గుండెలు బాదుకొనును.)

సీత:-శాంతమ్మ! శాంతపడవే! ఎందుకు వృథాగా ఏడుస్తున్నావ్ - నీకు మీ నాయన ఆ పేరు పెట్టినందుకు ఇప్పటికైనా ఓర్పుకలిగి మంచిని అలవాట్లు చేసుకొని కాలం గడుపు. నీ కోడలు అనసూయ చాల చదువుకొన్నది. ఈ ఊళ్ళో ఆడవాళ్ళంతా మీ అమ్మాయి బంతిలోజున అనసూయ చెప్పిన భాగవతార్థమును విని ఇప్పటికీ నాలిక కోసుకుంటున్నారు. అదేగనుక ఏ ఇంగ్లీషో చదివినట్లయితే నీవు ఇంతవరకు వచ్చేదానివా? నోరెత్తేదానివా?

శాంత:-ఓసి! నీ దుంపతెగ? అది ఎంత చదువుకుంటేనేమె? దాని చేతిపిండం తింటూ దాని దానిలాగా యుండమంటావా? ఇంత కాలంనుండి యజమానురాలైయుండి ఇప్పుడు దానిదాని నౌతానా? చస్తేకాను (చిటికవేసి) ఇదిగో చూడు సీతమ్మ నా తెలివయితే కొద్దికాలంలోనే దీన్ని వెళ్ళగొట్టి మా అబ్బాయికి మరొక మంచి పిల్లను తెచ్చి పెళ్లిచేసి తీరుతా.

సీత:-(నవ్వుతూ) ఓసి! నీ పిచ్చి తగలయ్యా; తరువాత వచ్చేది మొదటిదాన్నే మంచిదనిపిస్తుంది. ఇంకొకటికూడ ఆలోచించు. మళ్ళీ పెళ్లిచేస్తే అది కాపురానికి వచ్చేదాకా కొడుకు బ్రహ్మచర్యాన్ని అవలంబించాల్సిందే!

శాంత:-పోనీ వేశ్యనుంచుకుంటాడు.

సీత:-ఓసి! నీ దుంపతెగ! అందుకూ సిద్ధమైనావా! ఇదిగో శాంతమ్మ నా మాట వినకపోతే నీ నీ కొడుకు కూడా నిన్ను అసహ్యించుకుంటాడు. తరువాత నీ యిష్టం. నేను వెళ్ళిపోతున్నా (వెళ్లును) (విరామస్వరము వినబడును).

శాంత:-ఓసి దీని దుంపతెగ! మాయపిడుగులాగ వచ్చిందే! (అటుచూచి) అడుగో! మా పెద్ద బ్బాయి రఘులాగే ఉన్నాడే ఆ వచ్చేవాడు. రఘు అని పేరు పెట్టుకున్నందుకు ఆ అయోధ్య సాక్షాత్తు. అటువంటివాడు నా మాట వినకుండా పోతాడా? అయినా చెప్పిచూస్తాను. (ఏడ్చుచుండును.)

రఘు:-అమ్మా! ఎందుకు ఏడుస్తున్నావు.

శాంత:-ఎందుకు నాయనా నన్ను దుగతావు! ఇదంతా నీ భార్య చూచిందంటే నిన్నుగూడా సరిగ్గా చూడదు.

రఘు:_అమ్మా ! అదేమిటో చెప్పరాదూ ?

శాంత:-నాయనా! ఏమని చెప్పమంటావు ? ఎంతో శ్రమపడి మంచిపిల్ల గదా అని ఏరికోరి తీసుకొచ్చి నీకు కడితే అది ఇప్పుడు నన్ను ఎంతో అవమానపరుస్తూ ఇంట్లో పెత్తనాన్ని చెయ్యటానికి చూస్తున్నదిరా.

రఘు:_అమ్మ ! అందరు తల్లులు పుత్రునికొరకు ఎక్కడినుండైనా ఒక అమ్మాయిని తీసుకొస్తున్నారు. క్రమంగా ఆమెకు ఇంటి పెత్తనాన్ని అంటకడుతున్నారు. ఇది లోకసహజమే గదమ్మా !

శాంత:-ఓరి ! మూర్ఖుడా ! నేనుండగా దానికెట్లా పెత్తనం ఇస్తారా ?

రఘు:_అమ్మ ! వివేకవంతులైన తల్లిదండ్రులు వృద్ధులయిన తరువాత వారు సుఖములను పొందటానికే కొడుకు కోడళ్ళకు సంసారభారాన్ని అప్పగించుతారు.

శాంత:_వెఱ్ఱివాడా ! ఇంటిపెత్తనాన్ని భార్యకిచ్చి డబ్బంతా బావమరదికి కట్టపెట్టిస్తావురా ? చూడు రోజూ నీ భార్య ఏదో వంకమీద చెంబు బిందె తగలకొట్టుతూనే యున్నది. ధనమపహరించి పుట్టింటికి చేరవేస్తుంది. గర్వించి నీవిచ్చే అలుసు చూచుకొని మమ్మల్ని లెక్క చెయ్యటంలేదు.

రఘు:-అదేమిటమ్మా ! కాపురం నెత్తిమీదపడితే చిల్లిగవ్వనైనా ఇతరులకిస్తుందా ?

శాంత:-ఆ! ఆ। ఇంకేముంది? దాని టక్కుటమారి విద్యల్లో పడిపోయినావ్ !

రఘు:-మంత్రాలుంటేనేగా భర్త భార్యయందు ప్రేమగా ఉండేది? అయితే మన అమ్మాయి ఏ విద్యలు నేర్వనందుననే కాబోలు దానిభర్త దాని వశంకాలేదు.

శాంత:-అదేమిటిరా అట్లంటావు! నిజంగా మన అమ్మాయే నీ భార్య మాదిరిగా మంత్రాలు నేర్చియుంటే తప్పక వశమయ్యేవాడే ? ఛా! అది మనకు తగదని తలంచే తన సుగుణాలచేత మొగుణ్ణి సేవిస్తుంది. వాడు మాత్రం వశంకావటములేదు. నీ మాదిరిగానే అల్లుడుగూడా పెళ్లాం మాట వింటూంటే వాళ్ళకు వీళ్ళకు చెప్పకొని ఏడ్చేదానిగా !

రఘు:_అమ్మ! నా కూతురుకి అల్లుడు వశంకాలేదని కోడలితో పోట్లాడితే నీకేం లాభం చెప్ప ?

శాంత:_ఒరే! దాని వంశం నీకేం తెలుస్తుందిరా ? నీవు పిల్లవాడివి. లోకానికి తెలుసు దాని తండ్రి యెంత చెడ్డవాడయింది, తల్లి యెంత దుర్మార్గురాలయినది, అన్న చెల్లెళ్లు ఎంత తిరుగుబోతులయిందీను ?

రఘు:-అమ్మ ! నీ కూతురు అత్తగారు కూడా ఇట్లాగే కోపం వచ్చినప్పుడల్లా మనవంశాన్ని అంటుందేమో ? అమ్మా ! అన్నీ విచారించి తీసుకొచ్చిన దాన్ని ఇట్లా అనటం తగదు ?

శాంత:-(తల బాదుకొంటూ) ఇక నేనేమి చేస్తాను. కాని పురుషుని కర్మకొద్ది ఆడది దొరుకుతుంది.

రఘు:_(స్వగతం) ఎట్లయినా తల్లిదండ్రులు పూజ్యులు. తల్లిని శాంతపరుస్తా. (ప్రకాశం) అమ్మా ! నీ నీ కోడలు మంచిదో చెడ్డదో తీసికొచ్చావు ! కనుక నీ కూతురునిగా క్షమించవలసిందిగా ప్రార్థించుచున్నాను. (అని పాదములు పట్టుకొనును)

శాంత:_ఛీ! మూర్ఖుడా! ఛీ. ఛీ. ఎక్కడినుంచో వచ్చిన దుర్మార్గురాలు, నా కడుపున పుట్టిన కూతురితో సమానమవుతుందిరా ?

రఘు:_ఎక్కడినుండో వచ్చిన అల్లునిమీద ఎందుకంత పుత్రప్రేమను చూపిస్తున్నావో చెప్ప ?

శాంత:-అయితే! నా అల్లుడు తప్పేం చేస్తున్నాడు?

రఘు:-పూర్వమొకప్పుడు నేనవతలకు పోగానే నీ కూతురుమీద కోపంవచ్చి నీ అల్లుడు నీ కూతుర్ని వినరాని తిట్లుతిట్టి శీఘ్రంగా నావెంట బయలుదేరంటే, నీవు చిరునవ్వు నవ్వి ఊరుకోలేదా ?

శాంత:_ఇది అబద్ధమాడుతున్నావు. అవతలకు పోయినవాడికి మా ఓట్లా తెలుస్తుంది? నీ పెళ్లాం చెప్పితే అట్లంటున్నావు.

రఘు:-(స్వగతం) ఆహా! ప్రపంచంలో స్త్రీలు ప్రేమపాత్రులయిన తమ కూతురు అల్లుళ్ళు ఎంత దుర్మార్గులయినను వారి నిందను స్తోత్రంగాను వారి తప్పులను ఒప్పులగాను గ్రహిస్తారు. ఆహా! అల్లుడనే అంజనం ఎంత పనిచేస్తుంది! అది స్త్రీలకు దుష్టుడైన అల్లునిగూడ శిష్టునిగా చూపిస్తుంది. (ప్రకాశం) అమ్మ నీవన్నట్లు నీ అల్లుడు చాలా బుద్ధిమంతుడు, నీ కోడలు చాలా చెడ్డది. అయితే నన్నిప్పుడేమి చేయమంటావు ?

శాంత:_నీ భార్యను ఎక్కడైనా ఒక గుడిసెలో వుంచి దాని పొట్టకి సరిపోయే ధాన్యాన్ని నేను గాని, నా కూతురుగాని ఇచ్చేటట్లు చెయ్యాలి.

రఘు:-(స్వగతం) అయ్యయ్యో ! మాతృభక్తి నా

కోపాన్ని అరికట్టుకుంటే! (ప్రకాశం) అమ్మ! ఆ తరువాత.

శాంత._ఆ దుర్మార్గురాలు ఎక్కడున్నా సరే నేను నీవు జీవించియుండాలంటే అక్కడకు నా ఆజ్ఞ లేనిదే పోకూడదు.

రఘు:-అమ్మ! ఇట్లాచేస్తే నీకేమి ప్రయోజనమే?

శాంత:-నా బంగారుతండ్రీ! అట్లడుగు - నీ చెల్లెలు భర్తతోగూడ వచ్చి ఇక్కడే హాయిగావుంటుంది. పెద్దవాళ్ళమయిన మా ఇద్దరికి సేవచేస్తుంది.

రఘు:_అయితే! కోడలు నీ కూతురికి ఏమపకారం చేసిందని?

శాంత:_ఏంచేసిందా! విను. నా బిడ్డకు ఏ శాస్త్ర సొమ్ము పెట్టినా, ఏం వండిపెట్టినా సరిగ్గా చూడ లేదు. నీ భార్య తప్పులు నీకేం తెలుస్తాయిరా?

రఘు:-అమ్మ! సరే! ఇంకేం నీవు చెప్పినట్లు చేస్తాను. అది వినకపోతే నేనేం చేస్తాను!

శాంత:_సరే! పదినెలలు మోసి కనిపెంచినందుకు నేనే విషంత్రాగి చస్తారా! (తల బాదుకొంటూ ఏడ్చును).

రఘు:-ఎందుకే అట్లా బాదుకుంటావు! తండ్రిగారు చెప్పినట్లు చేద్దాము.

శాంత:_ఆ ముదుసలికి నేను బ్రతకటం ఇష్టంలేదురా! ఆయనకూడ కోడలికి లొంగిపోయినాడు. ఛా! ఛా! ఇక నీ ముఖంకూడ చూడగూడదు. నేను వెళ్ళుతున్నా (పోవును) (విరామస్వరము వినబడు చుండును).

రఘు:-(పరికించి చూచి) ఆ వచ్చేది ఎవరు? నా భార్య అనసూయా కాబోలు! (నిదానించి) అనసూయే! పాపమామె మా అమ్మను చూడ గనే సింహము దగ్గర లేడిలాగా వణికిపోతుంది. నా అనురాగమును చూచి మళ్ళీ ధైర్యం తెచ్చు కుంటుంది. ఏమైనా వీలుచిక్కితే నాతో ఏదో రహస్యం చెప్పటకు ఉవ్విళ్ళూరుతుంది. ఏం చదువుకుంటేనేమి! దానివిద్య ఈ అత్తముందర అడవినకాచిన వెన్నెలలాగ అవుతుంది.

అనసూయ:-(ప్రవేశించి తనలో) పాపము! నా భర్త మాతృభక్తి పరతంత్రులై తల్లిని ఏమనలేక ఎట్లా పరితపిస్తున్నారో! ఒకవైపు మాతృభక్తి, ఒక వైపు భార్యప్రేమ వారిని బంధిస్తున్నయ్.

రఘు:_ఏం అనసూయ! ఏం పనిమీద వచ్చావు!

అన:_మీతో ఏమన్నా చెప్పాలనుకున్నా మీ అవస్థ చూచి దడుస్తున్నాను.

రఘు:-పిచ్చిదానా! భయమెందుకు నిస్సంశయముగ చెప్పొచ్చు చెప్పు.

అన:_మనమిలా ఎంతకాలం గడపాలి? రాత్రిళ్ళు మీరు అన్నంతిని పడకగదిలో ప్రవేశించగనే మీ అమ్మ త్వరత్వరగా వచ్చి గది గడపమీద తలపెట్టి పడుకొంటుంది. ఇక నేను మీవద్దకెలా వచ్చేది చెప్పండి. పగలుగూడ మీవద్ద ఏదైనా అవసరమైన పనుంటుందని వస్తుంటే తాను వేరొక పనిచెప్పి నిర్బంధిస్తుంది. రాత్రిళ్లకూడా చాలా ప్రొద్దుపోయేదాక నానాపనులు చేయి స్తుంది. మీరు పిలిచినను ఇంకెవరైనా మీవద్ద నున్నప్పుడే రానిస్తుంది. ఇంక చెప్పలేనండి. అన్నం కొద్దిగా పెట్టి అది అయిపోతుండగ సహించలేని మాటలంటుంది. పచ్చనిపువ్వు కమ్మనిగుడ్డ ధరిస్తే అసలే సహించలేదు (దుఃఖముతో) ఇక చెప్పలేనండి.

రఘు:-(స్వగతం) ఆహా! ఏమి చెప్పటకు నోరాద కుండ నున్నది. అన్నం తినకుండగనే ఇంట్లో నానాచాకిరి చెయ్యాలట! ఇప్పుడు ఈమెను చూచిన ఈమె తల్లిదండ్రులే గుర్తుపట్టలేరు. (ప్రకాశం) అనసూయ! అయితే మా అమ్మ మీద చాడీలు చెప్పటానికే వచ్చావేమిటి?

అన:-అందుకనే భయపడి మీ తల్లిగారి దౌష్ట్యాన్ని మీతో సంపూర్ణంగా చెప్పను. అల్లునిరాక అత్తగారికి మహోత్సవము. ఎల్లప్పుడు ఆ మహోత్సవమే ఉండాలనుకుంటాను. కాని అది మన ఎడబాటుకు కారణమవుతుంది. ఆ ఉత్సవ మహోత్సవము చూడండి. గట్టి పట్టుబట్టగుండ నేలికలవుతుంది, నెయ్యి సముద్రంగా అవుతుంది. అవసరమైతే మంచిగంధపు చక్కలే కట్టెపుల్లలవుతాయి. గడ్డపెరుగుగూడా కడకు నీళ్ళలాగా వాడబడుతుంది. ఇన్నెందుకు రూపాయి గవ్వగా మారుతుంది.

రఘు:_పిచ్చిదానా! నీవుకూడ ఆ దశమగ్రహ ఆవేశంవలన అట్లాగే చేస్తావులే?

అన:-మీ అమ్మగారు అనవసరంగా నా మీద కేకలు వేయకుండ ఉంటే అదే పదివేలు. ఎట్లా ఖర్చుపెట్టితే నాకెందుకు!

రఘు:-నీవెంత చెప్పినా ప్రయోజనంలేదు అనసూయా! మా అమ్మను నేను కాదనలేను.

అన:_అయ్యయ్యో! ఎంత పాపము! ఎంత పాపము నేను ద్వేషించమనను. తల్లియేగదా పుత్రునికి

దైవము. నేను అత్తగారి దౌష్ట్యాన్ని ఎంతైనా సహించగలనుగాని మీరు మాత్రం తల్లికి లొంగి నన్ను బాధింపవద్దని ప్రార్థించుచున్నాను.

రఘు:-(స్వగతం) నిజంగా ఇది అనసూయ అను తన పేరును సార్థకపరుచుకున్నది. ఇది నిజంగా దుష్టురాలయితే తను అత్తవలన బాధలుపడుతూ కోపంతో భర్తతో మీ తల్లిని నీవు వదలకపోతే బావిలోపడైనా, విషంత్రాగైనా మరణించుతా అని బెదిరించేది. (ప్రకాశం) అనసూయా! సరే! నీకు నామీద ప్రేముంటే అంతా సహించుకొంటుంను.

అన:-మీ అనురాగమే నాయందుంటే ఎంతైనా సహించగలను.

రఘు:-అనసూయ, ఆ వచ్చేది మా నాన్నగారను కుంటాను. నీవు త్వరగా వెళ్ళి నీ పని చేసుకో వెళ్లు.

అన:-సరే వస్తా. (వెళ్లును) (విరామస్వరము).

కామయ్య:-(ప్రవేశం) (స్వగతం) అబ్బబ్బ! నా భార్య మూర్ఖురాలై అకారణంగా కోడల్ని బాధిస్తున్నది అనేదే రాత్రింబవళ్ళు నన్ను వేధించి మన్ను చేస్తుంది.

రఘు:-నమస్కారము నాన్నగారు! ఏమిటట్లా చింతగా ఉన్నారు.

కామ:-నాయనా! కోడలు కుమారునిలో సగభాగము గనుక వివేకవంతులు వారిని వేరువేరుగా చూడగూడదు గదా!

రఘు:-నాన్న! కోడలు మంచిదైన కుమారునితో సమానంగా చూడాలి! కోడలు చెడ్డదయితే?

కామ:-చెడ్డదో మంచిదో అది అదృష్టాన్నిబట్టి ఉంటుంది. అత్తమామలు మాత్రం కోడలిని తన కూతురునివలె చూడాలి. అది న్యాయం. అహా! విచిత్రము. దుష్టురాలు తన కుమారునికన్న అల్లుడునే శ్రేష్ఠునిగా తలుస్తుంది. చెమటోడ్చి సంపాదించినదాన్ని కూతురుకే సొమ్ముగాయిస్తే దానికి అల్లుడే ప్రభువు గదా! తల్లిదండ్రులు గారు. సోదరుడు కాడు. ఆ సొమ్ము కెంత ఖర్చయినా గృహిణికి సంతోషమే. కాని తన కోడలి సొమ్ము చూచి అది కొద్దైనా దానికి తన పుత్రుడే ప్రభువైనా సహించలేదు. (తనలో) (అటుచూచి) ఆ! ఆ కిటికీలో ఎవరు? పాపము అనసూయ మా మాటలు వింటుందికాబోలు.

అన:-(కిటికీవద్ద ఉండి మాటలు వింటూ) (తనలో) ఇటువంటి యథార్థవాది నా అదృష్టంవలన నాకు మామగారైనారు.

రఘు:-నాన్న! తనబిడ్డ జీవితమునకు అల్లుడు కంఠసూత్రమగుటచే వాళ్ళయందు అత్తలు అతిప్రేమ కలిగియుండుట లోకసహజమేకదా!

కామ:-వెఱ్ఱివాడ! కుమారుని సంసారముగూడ కోడలి జీవిత మిశ్రమైన జీవితమేగదా! ఇందేది తక్కువ.

రఘు:-కాదు కాదు. కోడలు పోతే ఇంకొకతె వస్తుంది. ఒక అల్లుడు పోతే ఇంకొకడు కూడదు గదా!

కామ:-నాయనా! రెండవ కోడలు వస్తే అది చిన్నది. పుత్రుడు పెద్దవాడు. ఆ అనురాగం ఎంత లక్షణంగానో వుంటుంది.

రఘు:-ఇదంతా ఎందుకు. మన విషయంలో ఏమి చెయ్యాలో చెప్పండి.

కామ:-కలహసమయంలో కులక్షేమంకోరే యజమాని విరోధించేవారిని వేరేపెట్టాలి.

రఘు:-సరే! అయితే అమ్మగారు ఈ సుందర మందిరంలోనే ఉంటుంది.

కామ:-సర్వసౌఖ్యాలనుభవించిన ముసలదానికి ఈ సుందరభవనం దేనికి? జీర్ణమందిరమే తగినది.

అన:-(స్వగతం) అయ్యో! నా భర్త తండ్రిమాట విని తల్లిని వెళ్ళగొడితే భార్యకు లోబడి తల్లిని వెళ్ళగొట్టాడని వారికి చెడ్డపేరు వస్తుందేమో? (విరామస్వరము వినబడును)

రఘు:-(ప్రక్కకు చూచి) నాన్న! నా చెల్లెలు లక్ష్మి ఎందుకనో గబగబవస్తుంది?

కామ:-తెలియక దానికి లక్ష్మి అని పేరుపెట్టాము. సుంధర అంటే బాగుండేది. ఇది తల్లికన్న మూడు ఆకులెక్కువే చదివింది.

లక్ష్మి:-(ప్రవేశించి) నాన్న! అన్నయ్య! ఏమిటిట్లా అమ్మను చూస్తూ ఊరుకుంటున్నారేం? మీరు చూడకపోతే దానికి దిక్కెవరు? అది కోడలితో ఏగలేక అన్నం నీళ్లు లేకుండగ చావుకు సిద్ధమయింది (దుఃఖము).

కామ:-అమ్మాయ్! మీ అమ్మ ఇక చచ్చిపోతేనే బాగుంటుంది.

లక్ష్మి:-నాన్న! నీకు చాకిరి చేయటానికి కోడలుంది గదా అని నిర్లక్ష్యం. నాకు దిక్కెవరు మరి?

కామ:-ఆ యుత్తమురాలైన నీ అత్తగారే!

లక్ష్మి:-ఆమె నామీద చాడీలు చెప్పి దయలేకుండగ నా భర్తచేత వెళ్ళగొట్టించింది. ఆ విషయం కూడ మా అమ్మను బాధిస్తుంది.

కాము:-కోడల్ని తాను ఏడిపిస్తే వాళ్ళ అమ్మకూడ అట్లాగే కష్టపడుతుందని మీ అమ్మ అనుకోనవసరం లేదా ?

లక్ష్మి:-ఇదంతా కోడలిమాట నమ్మి మాట్లాడటం గాని... ఆమె మాట ఆదరింపతగినదే. దాని తండ్రి వళ్ళంతా రత్నాలతో నింపి పంపాడు. మంచి మంచి గుడ్డలు ఇచ్చి పంపాడు.

కాము:-అమ్మాయ్. నిన్ను పాషాణాలతో అలంకరించానా ? నారబట్ట కట్టి పంపానా ? ఆడబిడ్డలకు ఏమిచ్చినా తృప్తిలేదు. ఇది గుడ్డకు, ఇది సొమ్ముకు, ఇది సామగ్రికి అని డబ్బంతా దోచుకుపోతారు. మీరు పర్వతాన్నిచ్చినా, భూమినిచ్చినా, ఆఖరకు సముద్రాన్నిచ్చినా తృప్తిపడరు సరిగదా ! సోదరులెట్లా అయిపోయినా అని దిగులుండదు. ఇది ఇట్లావుండగా తల్లిదండ్రులను పీడించి భార్య ఎంత తెచ్చినా మొగుడు మీ నాయన నీకేమిచ్చాడు అని నిందించుతాడు.

లక్ష్మి:-అన్నయ్యా ! నాన్న శుద్ధఅబద్ధం చెప్తున్నాడు. నీవెప్పుడయినా మా వదిన నిట్లా అన్నావా ?

రఘు:-(నవ్వుతో) అవును. అనలేదు లక్ష్మి.

కాము:-అమ్మాయ్. ఇదంతా చెడ్డవాళ్లైన తల్లి కూతుళ్ళనుగూర్చి చెప్పాను. మంచిపిల్లయితే తండ్రి ఇచ్చినది కొద్దిదైనా తృప్తిచెందుతుంది. గుణవంతుడగు అల్లుడును తృప్తిచెంది అత్తమామలను తృప్తిపొందిస్తాడు.

రఘు.-చెల్లీ! ఇది అటుంచు. అమ్మ ! ఏమంటుంది.

లక్ష్మి:-ఈ కోడలితో కూడి ఉండనని.

అన:-(స్వగతం) నా నెత్తిమీద పాలుపోసినట్లు.

రఘు:-అట్లయితే మీ వదినకు ఇంకెక్కడైన ఇల్లు చూచి ఉంచుదాము.

లక్ష్మి:-అదేనన్నాయ్. అమ్మకు కూడ ఇష్టమైన పదతి.

కాము:-(కోపంతో) ఆ ! ఆ ! మీ అమ్మకు ఏది ఇష్టమో అది చేయుటకు వీలుపడదు. అందుకని దానిపొట్టకు సరిపడే ధాన్యం ప్రతినెలా ఇస్తాను. అది ఎక్కడైనా ఉండనీ సరే !

లక్ష్మి:-అయితే! నేనిక్కడకు రాకూడదని అమ్మతో కలసి ఉండగూడదని కోరుతున్నారు.

రఘు:-అట్లంటావేమిటీ! నీవెన్నిసార్లైనా వచ్చి నీ యన్నతో ఉండి అత్తవారింటి శ్రమ పోగొట్టుకొనవచ్చును.

లక్ష్మి:-ఓరి పాపుడా! అమ్మలేని గృహంలో ఎవ్వరిచేతనో ఇవ్వబడే పిండం తింటూ సుఖించమంటావ్ ?

కాము:-నీకూ సరిపడేట్లే ఇస్తాను. ఇంకేం సరిపోయిందా ?

లక్ష్మి:-పాతకుడా ! నన్ను దాసిలాగ ఎంచుతున్నావా ?

రఘు:-అమ్మాయ్ ! ఇప్పుడే మీ ఇద్దరికి ఎంత కావాలో అంత ఇస్తాను.

లక్ష్మి:-(స్వగతం) ఇది నాకు మంచిదే! ఆ వచ్చిన దాన్ని అమ్మి అమ్మ నాకు నగలు నాణ్యాలు చేయించిపెట్టుతుంది. (ప్రకాశం) నాన్నగారు ! మీరన్నట్లు, అన్నయ్య అన్నట్లు చేయండి. అట్లాగే చెప్పి అమ్మను ఊరడింపచేస్తాను. (వెళ్లును)

రఘు:-అమ్మాయ్! నిర్బంధం మాత్రం చెయ్యవద్దు. ఆమెకు ఎట్లా ఇష్టమో అట్లాగే చేస్తాను. (విరామస్వరము)

లక్ష్మి:-(తెరలో రహస్యం) అమ్మ! అమ్మ ! నా మాటవిను. నీవు తిరస్కరించవద్దు ఇదంతా నాకు లాభకారియే.

కాంత:-(రహస్యం తెరలో) ఓ సీవ్ లక్ష్మి ! మొదట్లో నేను ఒప్పుకోనట్లు నటిస్తాను. ఏదైనా కాస్తోకూస్తో డబ్బువస్తే ఇదేనయం. (విరామ స్వరము)

(కాంతమ్మ, లక్ష్మితో ప్రవేశించును)

రఘు:-అమ్మ !

కాంత:-ఓరి మూర్ఖుడా! నేటినుండి నన్ను "అమ్మ!" అని పిలవద్దు. నీ పక్కమీదజేరి నీ చెవిలో ఊదినదంతా దానికి సిద్ధించినట్లయింది.

రఘు -అమ్మ నన్నుగురించి కోపమెందుకు ? ఇదంతా తండ్రిగారి ఏర్పాటు.

అన:-(స్వగతం) హే భగవాన్! నా భర్తను మాతృకోపమునకు పాత్రునిగా చేయవద్దు.

కాంత:-అయ్యో! ఇంకేముంది. ఆయన్ని కూడా ఆ దుర్మార్గురాలు వశపరచుకొన్నది.

కాము:-ఓసి నీ దుంపతెగ ! నీ మాదిరి కాదు. దాని గుణములు సత్పురుషులందరిని వశపరచుకోవటానికి తగియున్నవి. ఇంక నీ తల నెరుస్తున్నా

(8వ–పేజి తరువాయి)

హోటలులోనుంచి అన్నం తెచ్చివుంచానని, వాటికి పెద్దబిల్లు తయారుచేసి నా బల్లమీద వుంచాడు...

నా యీ అసహాయస్థితిలో మంచంమీదినుంచి లేచి కూర్చుండటమే బ్రహ్మాండమైంది. అద్దంలో ఒకరోజున నా మొహాన్ని చూసుకుని హడలిపోయాను. వారంరోజులనుంచి స్నానంలేదు. క్షౌరం లేదు. బట్టలని మార్చుకున్నవాణ్ని కూడా కాను. (నా ఒంటిమీద వున్న దుస్తులు తప్ప మరే బట్టలు నా దగ్గర వుంటేగా అంత అదృష్టం వుండటానికి?) గడ్డం బాగా పెరిగిపోయింది. దాంతో బయట అడుగుబెట్టానా పిచ్చివాళ్ళ క్రింద కట్టేసి వాళ్ళు వుండాలసిన చోట్లకి తప్పక తీసుకుని వెడుతారు! అలాంటప్పుడు మా ఇంటికి వెళ్ళటం, నా మొహం మాగ్దాకి చూపెట్టడం ఈ జన్మలో అసంభవం!...

ఇలా నాగొడవ నాది. ఆ పెద్దమనిషి తనగొడవతో నన్ను పెట్టే బాధ ఇక మాటలతో చెప్పటం అనవసరం! అతనికి కావలసింది డబ్బు! డబ్బు! డబ్బు! డబ్బు తెచ్చే వస్తువులన్నిటిని నా దగ్గరనుంచి యీ రోజుల్లో ఆ సాకు చెబుతూ ఈ సాకు చెబుతూ గుటకాయిస్వాహా చేశాడు. ఇంక నా దగ్గర ఏం లేదని తెలుసుకోటంతో, మా ఇంటికి వెళ్ళి నా ఖర్చులకి కావలసిన సొమ్మును తీసుకుని రమ్మని బలవంతం చేయటానికి ప్రారంభించాడు. అంతెందుకు? చప్పున ఇంటికి వెళ్ళి డబ్బు తెస్తేనేగాని తన ఇంట్లో వుండటానికి వీలులేదని నోటీసుకూడా ఇచ్చివేశాడు. దాంతో వూరకవుండే మనిషి అయితేగా! ఆ క్షణాన్నే అలా చేస్తానని వాగ్దానం చెయ్యక పోయానా, పోలీసువాళ్ళకి రిపోర్టు చేస్తానని అనరాని మాటలని అనటానికి మొదలెట్టాడు.

విదేశాలలో, ముఖ్యంగా జర్మనీదేశంలో, అక్కడి పౌరులు బసలని మార్చేటప్పుడు ఆ సంగతి పోలీసుశాఖవాళ్ళకి తప్పనిసరిగా తెలపటం ముఖ్యం. ఈ సంగతి ఇతర్లు పోలీసులకి రిపోర్టుచేశారా అలా తప్పుచేసిన వ్యక్తులని చట్టరీత్యా విచారించి న్యాయస్థానాలు జులుమానాలు విధిస్తాయి. అంతేకాదు కఠినశిక్షని కూడా విధిస్తాయి.

## II

ఎలాగో వారంరోజులు గడిపాను. జ్వరం తగ్గింది. లేచి కూర్చోగలిగే స్థితిలోకి వచ్చాను. లోబెడాన్స్ నేను లేచి కూర్చోటం పసికట్టటంతో ఎంతో ఆప్యాయంతో నన్ను సమీపిస్తూ ఆ రాత్రే మా ఇంటికి తరలిపోవటం అవసరమని పురమాయించాడు. అలా చేయకపోయానా, మరుసటిరోజున పోలీసువాళ్ళకి రిపోర్టుచేస్తానని అదమాయించాడు.

ఇక్కడికి వచ్చినరోజున అనుకున్నది ఆరోజు రాత్రి ఎలాగో పిళ్ల ఇంట్లో గడిపివేసి, మరునాడు వుదయాన బ్యాంకుకి వెళ్లి నాకు కావలసిన సొమ్మని తెచ్చుకోవాలని, ఆరోజున మితిమించి త్రాగడంతో ఇవ్వాళ్ళ మంచం పట్టాలని వచ్చింది. ఇవ్వాళ బ్యాంకుకి వెళ్లిరావటానికి ఇంకా వ్యవధి వుంది. కాని ఈ వారంరోజుల్లో అక్కడ ఎంత కర్మకాండ జరిగిందో ఎవర్లకి తెలుసు? మాగ్దా బ్యాంకువాళ్ళకు నోటీసు ఇయ్యక వూరకుంటుందా నేను ఇంట్లోనుంచి పారిపోయానని, ఆవిడ సమ్మతిలేకుండా ఏం ఇయ్యకూడదని, ఇలాటి విషయాల్లో బ్యాంకువాళ్లు కూడా తమ ఖాతాదార్ల ఆస్తిపాస్తులని చక్కబెట్టటంలో ఎంతో జాగ్రత్తతో వుంటారన్న సంగతి నాకు బాగా తెలుసు. నేను అక్కడికి వెళ్లటంతో మాగ్దాకి టెలిఫోను చేస్తారు. ఆవిడ డాక్టర్లని వెంటబెట్టుకునే అక్కడ ప్రత్యక్షమవుతుంది. తరువాత కథ ఎలా నడుస్తుందో నాకు స్పష్టంగా తెలుసు. అంచేత బ్యాంకుకి వెళ్లటం ప్రమాదం అని అనుకున్నాను. లోబెడాన్స్ పురమాయించినట్లు రాత్రిపూట మా ఇంటికే వెళ్ళిరావటం అన్నివిధాలా మంచిదని నిశ్చయించుకున్నాను.

నా నిశ్చయాన్ని ఆ పెద్దమనిషి తెలుసుకున్నాక అతని ఆనందం ఇక చెప్పటం అనవసరం కదూ! ఎంతో కాలంనుంచి చూడక చూడక వున్న ఆప్త మిత్రుని ఆ క్షణాన్నే కలుసుకునే భాగ్యం కలిగినందుకు సంతోషిస్తూవున్నట్లు మందహాసంచేస్తూ ఆప్యాయంగా నన్ను పలకరిస్తూ "ఇవ్వాళ రాత్రి పన్నెండు గంటలకే బయలుదేరి వెళ్ళండి. వుత్త చేతులతో మీరు బయలుదేరటం మంచిది కాదనుకుంటూ మీకోసం మంచిబుడ్డి తీసుకునివచ్చాను. మీరు వెళ్ళేటప్పుడు దానిని మీకు ఇస్తాను... అక్కడనుంచి ఏమేం తెస్తారో! ఆ గొడవనంతా చూసుకోటానికి మీరు వున్నారుగా!...నగల సంగతి మరచిపోకండి. వెండిసామాను ఎంత దొరికితే అంత తీసుకునిరావటం చాలా మంచిది... నాకు బాగా తెలిసిన షరాబు వున్నాడు. అతనికి మనం వాటిని అమ్మచూపామా! ఆ సంగతి ఇప్పుడు ఆలోచించటమెందుకులెండి!...ఇంతెందుకు? చేతికి ఏం దొరికితే దాన్నంతా తటపటాయించక తీసుకుని

రావటం ముఖ్యం...ఇలాంటి విషయాల్లో మీకు చేదోడువాదోడుగా నేనున్నానన్న సంగతి జ్ఞాపకం వుంచుకోనండి...” అని ఇటుచూస్తూ, అటుచూస్తూ, ఆ సంగతులు ఈ సంగతులు జ్ఞాపకంచేస్తున్నట్లు నాటకం ఆడుతూ పెద్ద వుపన్యాసం ఇచ్చాడు.

తలతీసి తలనిపెట్టే మనిషి యీ లోబెడాన్స్! అతను ఇందులో కలుగచేసుకున్నాడు. ఇక జలగకి మల్లె పీడిస్తాడు. అతనికి ఇయ్యాల్సిన సొమ్ముని ఇచ్చివేసి మరోచోటికి వెళ్ళిపోవటం అన్నివిధాల మంచిదని నాకు తెలుసు. అంచేత అలాగే ఆరాత్రే వెళ్తానని వాగ్దానంచేశాను...

అర్ధరాత్రి అయింది. గాఢనిద్రలోనున్న నన్ను అతనే లేపాడు. తను తెచ్చివుంచిన బుడ్డిని నా లాగు జేబులో వుంచుతూ తలుపు దగ్గరవరకు నావెంట వచ్చి “అన్నిపనులు జాగ్రత్తగా చక్కబెట్టుకుని తెల్లవారేలోపునే ఇంటికి చేరుకో”మని పురమాయిస్తూ నన్ను సాగనంపాడు.

## III

ఇన్నాళ్లు జబ్బుపడి ఇంట్లోనే వుండిపోయినా ఈరాత్రి ఆరుబయట నడవటం ఏమాత్రం కష్టమనిపించిందికాదు. ఇక్కడినుంచి మా ఇంటికి చేరుకోవాలంటే ఒక గంటకి పైగా సందుగొందులని దాటుకుంటూ నడవాలి. అలా వెడుతూ వున్నప్పుడు ఎవ్వళ్లకీ అనుమానం కలుగకుండా వుండటానికి ఎంతో జాగ్రత్తగా నాటకం ఆడుతూవుండటం అవసరం! స్కూలు రోజులలో ఇలాంటి పనులకి సంబంధించిన కథలని గాథలని ఎన్నో చదివాను. అవన్నీ ఇప్పుడు చప్పున జ్ఞాపకం వచ్చాయి. వాటినే నెమరువేస్తూ మా ఇంటి పరిసరాలకి క్షేమంగా చేరుకున్నాను. మా గేటుని తెరవబోతూవున్న సమయంలోనే వూళ్లో గుడిగంటలు ఠంగున కొట్టాయి....

లోపల అంతా నిశ్శబ్దంగావుంది. దీపాలు లేవు. అంటే మాద్గా గాఢనిద్రలో వున్నదన్నమాట! ఇక పనిమనిషి సంగతి చెప్పటం అనవసరంకదూ! రాత్రి ఎనిమిది తొమ్మిది గంటలకి ఇంటిపనులు పూర్తిచేసుకోటంతో దాని ధ్యాసఅంతా తన గదిలోకి వెళ్లిపోయి చీకూచింతా లేకుండా పడుకోవాలనే! ఇంట్లో మాద్గా ఎక్కడ పడుకునేది ఆ చీకట్లో తెలుసుకోటం అంతకష్టంకాదు. చడీచప్పుడు లేకుండా అటుకేసి వెళ్లాను. కిటికీలు తెరిచేవున్నాయి. పసిపాపకిమల్లె హాయిగా నిద్రపోతూవున్నది...ఆ దృశ్యాన్ని చూసేటప్పటికి నాకే విచారంవేసింది. ఇన్నాళ్లు సంసార చక్రాన్ని కలిసిమెలిసి నడపాం. మాటపేచీలో ఇంత రాద్ధాంతంచేసి వచ్చేశాను. తప్పంతా నాదే! పశ్చాత్తాపం తెచ్చుకుని ఆవిడని క్షమించమని బ్రతిమాలుకోంటేనో? ఇదే మంచి అవకాశం. కిటికీలోనుంచి లోపలికి వెళ్ళటం సులభం....

నేనొక్కడిని అయితే నా మనసాక్షి చెబుతూ వున్నట్లు చేయగలిగేవాడ్నే! కాని నాలో రాక్షసి ఘటంకూడా వుంది! అది నా మనసాక్షి ఇచ్చిన సలహాని ఒప్పుకునే స్థితిలోవుంటేగా! మాలో మాకు ఎంతోసేపు తర్జన జరుగుతూవుంది. నా దృష్టి ఆ చీకట్లో లోపల పడుకునివున్న నా మాద్గాకేసే! కన్నీరు తుడుచుకోలేక తికమక పడిపోతూ వున్నాను...ఏలాగయితేనేం ఆ రాక్షసిదే పెద్ద చెయ్యి అయిపోయింది. ఇక వుండటం ప్రమాదం అనుకుంటూ అక్కడినుంచి ఇంటిముందుకు చేరుకున్నాను. తలుపుతాళం నాదగ్గరే వుంది. దాంతో తలుపుతీసి లోపలికి ప్రవేశించాను....

## IV

బూడ్సులని బయటే విడిచివచ్చాను. ఇంట్లో ప్రతిగదీ నాకు బాగా తెలుసు. అంచేత అంత చీకట్లో కూడా నా గదిని చేరుకోటం ఏమాత్రం కష్టమనిపించిందికాదు. గదిలో నా వస్తువులన్నీ చెక్కుచెదరకుండా వున్నాయి. మా పెద్ద అద్దం నాకు ఎదురుగానేవుంది. దాన్లో నా విగ్రహం స్పష్టంగా కనబడుతూవుంది. ఆ మాసిన దుస్తులు, ఆ పెరిగిన గడ్డం, దువ్వుకోటానికి మరచిపోయిన ఆ జుట్టూ చూస్తుంటే హడలిపోయాను.

“ఎందుకిలా దిగజారిపోయావు?” అని నన్నే నేను తిట్టుకుంటూ కన్నీరుకార్చాను. ఈ క్షణాన్నే మాద్గా గదిలోకి వెళ్ళి ఆవిడ కాళ్లని పట్టుకుంటూ “మాద్గా! మాద్గా! ఈ సమయంలో నువ్వు రక్షించకపోయావా, అధఃపాతాళంలోకి దిగజారిపోవాలని వస్తుంది. రోషంతో అప్పుడు ఏవేవో అనరాని మాటలని అని నిన్ను అవమానంచేశాను. నన్ను క్షమించు. ఆ కఠోరఘట్టాన్నే మరచిపోదాం” అని అనాలని వుబలాటపడుతున్నాను. అదంతా క్షణికం! తాత్కాలికమైన పశ్చాత్తాపం! అలాంటిదానికి ఆ బెట్టుసరిరాయుడు వూరకుంటాడా! చప్పున ఆ రాక్షసిదే పెద్దచెయ్యి అయింది.

“నువ్వు అలా ప్రాధేయపడినా ఆవిడ వూర

కుండే ఘటమైతేగా! ఆవిడకి ఇప్పుడు కావలసింది నువ్వుకాదు. నీ దుకాణం! నీ ఆస్తిపాస్తులు! వాటి కోసం ఏ పని చేయటానికి తటపటాయించే మనిషి కాదన్న సంగతి మాత్రం నువ్వు ఇప్పుడు అవగాహన చేసుకోటం అవసరం...నువ్వే చేజిక్కావా ఆ డాక్టర్లకి ఒప్పజెప్పేస్తుంది. వాళ్లు తిన్నగా త్రాగుబోతుల ఆస్పత్రికి చేరుస్తారు! జాగ్రత్త! జాగ్రత్త! జాగ్రత్త!" అని హెచ్చరిస్తూవుంది....

గదిలోనే తోలుపెట్టెవుంది. మా ఇంట్లోవున్న పెట్టెల్లో ఇదే అమూల్యమైంది. మార్గా పుట్టినరోజు పండుగనాడు నేనే ఎంతో ఖర్చు చేసి దీనిని కొన్నాను. పేరుకి ఇది మార్గా పెట్టె! మేం దంపతులం! అంచేత ఆవిడకి ఇందులో ఎంత హక్కు వుందో నాకు అంత హక్కువుంది. అంచేత దీనిని నావెంట తీసుకుని వెళ్ళటం అన్నివిధాలా మంచిదనుకున్నాను. నాకు కావలసిన వస్తువులని దీన్లో వుంచుకోవచ్చు. తరువాత విదేశాల్లో ప్రయాణం చేసేటప్పుడు వుపయోగపడుతుంది...

పెట్టెని తెరచి దాన్లో వుంచాలసిన వస్తువుల కోసం గది అంతా కలయచూశాను. అడుగున ఓవర్ కోటును మడిచివుంచాను. దానిపైన రెండు సూట్లని, పెద్దపెద్ద యాత్రలకి అవసరమయ్యే దుస్తులని అమర్చాను. స్నానాలగదిలోనుంచి షేవింగ్ సామాన్లని తెచ్చి ఒకమూల అమర్చాను. ఇంకోమూల నాలుగు అయిదు జతల చెప్పులని జాగ్రత్తపరచాను....

ఇంక కావలసింది డబ్బు! మేజాలో దుకాణం నుంచి సాయంకాలంపూట ఇంటికి తెచ్చే డబ్బు వుంచటం మాకు అలవాటు. నోట్లు వుంటాయి. నాణ్యాలు వుంటాయి. అంతా పెద్ద మొత్తాలే! వుదయం ఇంటినుంచి బయలుదేరి తిన్నగా బ్యాంకుకి వెళుతూ అక్కడ ఈ సొమ్మని మా ఖాతాలో జమ కడుతూవుంటాం. ఆ పని పూర్తిచేసుకున్నాకే మా దుకాణానికి చేరుకోటం......మామూలు ప్రకారం చాల డబ్బువుంటుందని దానినే తీసుకుంటే నెలల పర్యంతం చీకూ చింతా లేకుండా వుండవచ్చు! అనే నా ఆశ. అర తెరచి చూశాను! ఏ రెండు మూడు నోట్లో కొంచెం చిల్లరమాత్రం వుంది. లెక్కపెట్టాను. అంతాకలసి ఏబయి మార్కులకన్నా ఎక్కువలేదు (సుమారు రూ 55 లు) అంటే ఏ రోజు సొమ్ము ఆరోజే మార్గా బ్యాంకుకి పంపుతున్నదన్నమాట!... మిగతా డ్రాయర్లని లాగి చూశాను. ఎంతోసేపు చూశాను...అదృష్టవశాత్తు చెక్కు పుస్తకం ఒక మూల కనబడింది. దాన్ని తిన్నగా జేబులోకి చేర్చేశాను......

ఇంకేం చెయ్యాలి! ఇలాగే ఇక్కడే వుండిపోతే మార్గా మేలుకోవచ్చు. పనిమనిషి లేవవచ్చు. అంచేత ఇంతవరకు సేకరించిన వాటితోనే తృప్తిపడుతూ పెట్టెని పుచ్చుకుని వెళ్లిపోవటం మంచిదనుకున్నాను. ఇన్ని సామాన్లని వుంచినా పెట్టెలో ఇంకా స్థలం వుంది......

ఛటుక్కున లోబెడాన్స్ ఫురమాయించిన వస్తువుల సంగతి జ్ఞప్తికి వచ్చింది. వాటికి పెట్టెలో కావలసినంత స్థలంవుంది. నగలు తీసుకొని వెళ్లటం ప్రమాదం. మార్గాకి వున్న నగలు కొద్దే! వాటిని తన గదిలోనే వుంచుకుంటుంది. అటుకేసి ఇప్పుడు వెళ్లటం అంటే ఆవిడ చేతికి చిక్కిపోవటం అన్నమాట!......

వాటికన్నా అమూల్యమైనవి భోజనాలగదిలో వున్న వెండి సామాన్లు. చెంచాలు వున్నాయి. ఫోర్కులువున్నాయి. కత్తులువున్నాయి. మా తాహతు ఆర్థికంగా బాగా హెచ్చినతరువాత ఇంటి కోసం కొన్న సామాను. దీనికోసం పెద్ద మొత్తాన్ని ఆ రోజుల్లో ఖర్చుచేయాలసి వచ్చింది . ...

ప్రత్యేకంగా ఈ సామానంతా జాగ్రత్త పరుస్తానికి బీరువాలు వున్నాయి. వాటినంతా గాలిస్తూ నాకు వచ్చిన వస్తువులని ఏరి ఆదరాబాదరాగా నా గదిలోకి తీసుకొనివస్తూ పెట్టెలోకి చేరుస్తూవున్నాను. ఇప్పటికి పెట్టె బాగా నిండింది. అయినా మరి కొన్నిటిని వుంచటానికి స్థలం వుండటం చూస్తూ తిరిగి భోజనాల గదిలోకి వెళ్లాను. ఈదఫా తీస్తున్న చంచా క్రిందపడింది. ఆ చప్పుడికి హడలిపోయాను. వాళ్లంతా గాఢ నిద్రలో వుంటారు. ఇలాంటి చప్పుడు మూలాన ఏం ప్రమాదం వుండననుకుంటూ నాలోనేను సమాధానపడుతూ క్రిందపడ్డ చంచాని తీసి మరికొన్ని వస్తువులతో నా గదిలోకి వచ్చాను. అక్కడ వాటిని జాగ్రత్తపరచాను......

పెట్టె మూయటానికిముందు మరొక్కసారి భోజనాలగదిలోకి వెళ్లి ఇంకేమైనవుంటే తీసుకునివద్దామని అటుకేసి నడిచాను......

అక్కడ నిలుచుండి నాకేసి విస్తుపోతూ చూస్తున్న మార్గాన్ని చూడటంతో గడగడ వణికిపోయాను....

---



అమరజీవి గాంధీజీ యాత్ర

బుద్ధిలేక బంగారంవంటి కోడల్ని తిట్టి నీవు గనుక బయటకు పోతున్నావు.

శాంత:-ఓ ముసలి! నీవే వెళ్లు బయటకు నేనేమిః వెళ్ళను.

లక్ష్మి:-(రహస్యంగా) ఇష్! ఓ పిచ్చిదానా! అట్లంటావేమే. ఒప్పుకో ఇదేసమయం నా కేమైనా రావటానికి.

శాంత:-ఓరి దుర్మార్గుడ! ఒరై అబ్బాయ్! నేనే వెళ్ళతారా బయటకు. భార్యాదాసుడవై తల్లిని వెళ్ళగొట్టిన కీర్తిని కాస్తపొంది ఇక పెళ్ళాం చెప్పినట్లు విను. ఇదుగో! నా బిడ్డను ఇన్నాళ్ళ నుండి కంటికి రెప్పలాగా పెంచాను. దానికి దమ్మిడీ సొమ్మైన చేయించిపెట్టలేదు. ఇప్పుడు నడుమునకు రవ్వల వడ్డాణమును చెవ్వులకు రవ్వల జోడును చేయించిపెట్టు.

రఘు:-అమ్మ! నీ ఇష్టంవచ్చినట్లు చేయిస్తా.

కామ:-ఓసి పాపి! అంతా అమ్మాయికి దోచిపెట్టి కొడుకులను దరిద్రుల్ని చేయదలంచావా?

శాంత:.కూతురు అనగానే కళ్ళల్లో జిల్లేడుపాలు కొట్టుకుంటావ్?

కామ:_అహా! కూతురు అనే మూషికం తల్లి అనే బిలం ద్వారా పుట్టింటిలో ఉన్న మారుమూల నున్న వస్తువులనుకూడ హరిస్తుంది.

అన:_(స్వగతంలో) అదిగో సీతమ్మ కూడ సమయానికే వస్తుంది. ఆమెకు నాపై ఎంతో ప్రేమ. (విరామస్వరము)

సీతమ్మ:-(ప్రవేశం) ఏమిటి విచారిస్తున్నావ్ శాంతమ్మ?

శాంత:_ఇంకా విచారమేమున్నది ఒకటే విచారం. మనం చిన్నప్పటినుండి చద్దామంటే చద్దాం అను కొన్న స్నేహంతో ఉన్నాము. అట్లాంటిదాని వల్లా ఎందువల్లో నా కోడలివైపు తిరిగిపోయి నన్నే నిందిస్తున్నావు. మీ ఇద్దరికి అంత స్నేహమెందుకు కలిగిందో? (దుఃఖం).

సీత:-ఓసి పిచ్చిదాన! ఎందువల్లేముంది. దాని యందున్న సుగుణాలే కారణం. కాకులన్ని ఒక రేవు, హంసలన్నీ ఒకరేవు.

శాంత:_ఓసి నీ దుంపతెగ! నా కోడలు నన్ను బయటికి గెంటినట్లు నిన్ను నీ కోడలు బయటికి గెంటేయదుగదే? (మెటికలు విరుచును).

కామ: ఒసేవ్! కోడలు బయటకు గెంటిందని వాగుతావా? ఈ కర్రతో బుర్రపగులకొడతా?

శాంత:-ఓరి! ముడుకాళ్ళ ముసలి! కోడలికి లొంగిందిగాక ఇంక సిగ్గులేక ఏదో వాగుతున్నావే?

కామ:-అ! ఏమన్నావ్? (కర్ర క్రింద కొట్టును)

రఘు:-నాన్న! శాంతించు శాంతించుము.

లక్ష్మి:-(కిటికీలోనున్న అనసూయను చూచి) ఓసి గోముఖవ్యాఘ్రమా? నీమూలాన మా అమ్మ కూడ ఎంత కష్టపడుతుందో చూడు. ఇప్పుడు నీ కళ్ళు చల్లగా ఉన్నవా?

సీత:-(శాంతమ్మ) అవతలకు తొలుగు. (అనసూయను చూచి) అనసూయ ఇటు రామ్మ! ఒసేవ్! శాంతమ్మ! ఈ అల్లరంతా ఎందుకు వచ్చిందంటే నీ కూతురికి చదువు శూన్యంగాబట్టే గదా? ఇక దైవజ్ఞానం తెచ్చుకొని నే చెప్పినట్లు విను. బాగా ఆలోచించి చూడు. నిన్ను కొడుకు కోడలు చూడకపోతే సంఘం వాళ్ళను చివాట్లుపెడుతుంది. కాని, కూతురు అల్లుడు చూడకపోతే ఏమీ అనదు. కూతురు ఇచ్చినన్నాళ్ళు చేస్తుంది. ఉంటుంది. తరువాత పోతుంది. ఎప్పుడికీ ఈ కోడలుకు తప్పదు. స్త్రీకి అదృష్టమంటే భర్తతో గౌరవించబడుచు, కొడుకు కోడళ్ళచే సేవించబడటమే. ఇంతకన్నా ఏంకావాలి. బాగా ఆలోచించు. అమ్మాయ్! అనసూయ ఇటురామ్మ. మీ అత్తగారికి నమస్కరించు.

అన:_(నమస్కరించును.)

సీత:_అనసూయ! రోజూ మీ ఇంటికి వస్తుంటాను గాని సీత, సావిత్రి, అనసూయ మొదలైనవారి చరిత్రలను మీ అత్తగారికి, ఆడబిడ్డకు విని పిస్తుండవమ్మా.

కామ:-అనసూయ! ఆ సీతాదేవికి నమస్కరించు.

అన:-(నమస్కరించును)

సీత:-అమ్మ! అనసూయ! నీ భర్తవంటి కుమారులు నీవంటి కుమార్తెలు కలుగుగాక! దైవము సదా రక్షించుగాక. (విరామస్వరము)

(తెర)

సమాప్తము

(24 వ-పేజీ తరువాయి)

భ్రమరకూటం
స్వనాయి పట్టె
గాంధ్రు కప్పలు
డప్పులు కొట్టె.
కలికి పికములు
పాటలు పాడె
మయూరిసానులు
నృత్యములాడి.

వెలుఁగు జూపె
మిణుగురులు,
విందుఁజేసె
తేనెటీగలు.

—(౦)—

# కుందేలు - రైతు

(రష్యన్ జానపద కథ)

అనగా అనగా ఒకరైతు. ఒకనాడా రైతు పొలాల్లోంచి పోతుండగా ఒక పాదమాటున కుందేలొకటి కనబడింది. అబ్బ, యేమదృష్టం! రైతు ఆనందంతో యీ విధంగా తలపోయసాగాడు.

ఈ కుందేలును పట్టి అరరూబుల్‌కు అమ్ముతాను. ఆ అరరూబుల్‌తో చిన్న పందిపిల్లను కొంటాను.

ఆ పందిపిల్ల పెద్దదయి పన్నెండు పందిపిల్లల్ని పెడుతుంది. ఆ పందిపిల్లలన్నీ పెరిగి మళ్ళీ పన్నెండేసి పందిపిల్లల్ని పెడతాయి. వాటినన్నిటినీ అమ్మితే బోలెడంత డబ్బు వస్తుంది. ఆ డబ్బుతో చక్కని యిల్లు కట్టిస్తాను. ఇల్లుంటుందిగా, అప్పుడు పెళ్ళి చేసుకొంటాను. భలే అందమైన పిల్లను పెండ్లాడుతానే. మాకు పిల్లలు పుడతారు. ఆడపిల్లలంతా వాళ్ళమ్మలాగా, మొగపిల్లలంతా నాలాగ ఉంటారు. మొగపిల్లలు మాత్రం నాలాగే కిల్లాడీలై ఉండాలి.

నా కొడుకులు పెరిగి పెద్దవాళ్ళయి సేద్యం చేయటం మొదలుపెడతారు. డబ్బు బాగా ఉంటుంది గాబట్టి కోతల సమయంలో కూలీల్ని కూడా పెడతాను.

నా పెళ్ళాం ఇంటిపనుల్లో మునిగిపోయి ఉంటుంది. నేను కిటికీదగ్గర కూర్చొని అన్నీ ఒకకంట కనిపెట్టి చూస్తూఉంటాను. సంసారం పెద్దదయినప్పుడు పెద్దదిక్కుండాలిగా. నా కొడుకులికి దారిద్ర్యం అంటే యేమిటో తెలియదుగాబట్టి తలపొగరుగా వ్యవహరిస్తుంటారు. పొలంలో కూలీలను వేధించుకుతింటారు. అందుకు నేనక్కడే ఉంటాను.

ఒరే వాంకా, వాస్కా, కోల్కా కూలీలనలా వేధించకండి. ఒకప్పుడు నేనూ వీళ్ళలా బీదవాడినే. అందువల్ల నాకు బీదతనమంటే యేమిటో తెలుసు అని వాళ్ళను కూకలేస్తాను అంటూ రైతు నిజంగానే గట్టిగా కేక వేసేసరికి కుందేలు కాస్తా తుర్రున పారిపోయింది.




**కల్పవల్లి :** కృతివెంటి వెంకటేశ్వరరావుగారు, ప్రతులకు వేంకట్రామా అండ్ కో **వారి అన్ని** శాఖలకు వ్రాయనగును. వెల రు. 1.

ఈ ఖండకావ్యమునందలి శీర్షికలు మేలైనవై పద్యములు భావరసభరితములుగా నున్నవి. కవిత్వము సరళమైనదై ఉత్తమస్థాయినందుకున్నది. వీరి కవితాపటిమ ముందుముందు ఉత్తమోత్తమమయిన పద్యకావ్యములను రూపొందించగలుగునని సూచించుచున్నది.

**అరుంధతి :** శ్రీపురాణపండ రాధాకృష్ణమూర్తి, ప్రకాశకులు—అధ్యాత్మ ప్రచారక సంఘము, విక్రమహాలు,- రాజమండ్రి. వెల 25 న.పైలు.

పతివ్రతలలో నొకరైన అరుంధతి వృత్తాంతమునకు సంబంధించిన కథ. సులభశైలిలో వ్రాయబడినది. పిన్నలు, పెద్దలు చదువతగినది. నీతినియమాల స్థాయిని పెంపుచేయుట కుపకరించు యిట్టి చరిత్రలు యీ రోజులలో అత్యవసరము.

**ఆరోగ్య విజ్ఞానము :** శ్రీ కావిపాక ఆదినారాయణశర్మ, ప్రకాశకులు—శ్రీ స్వామి రామతీర్థ యోగప్రకృతి ఆశ్రమము, రామరాజనగరు, విజయవాడ. వెల 50 న.పైలు.

ఇందలి శీర్షికలు మానవుని ఆరోగ్యానికి సంబంధించిన విషయములనేకం వివరించుటతోబాటు మన చుట్టు గల ప్రకృతి వాతావరణములను గురించి, ఆరోగ్య రక్షణపోషణలకుగాను పాటించవలసిన నియమములను గురించి సూచించారు. ఈ చిన్న పుస్తకమును పఠించుటవలన తన జీవితమార్గమునే సవరించుకొని స్వీయ ఆరోగ్యాభివృద్ధిపట్ల శ్రద్ధ వహించును.

---



---

# సంపాదకీయములు

## స్వాతంత్ర్యలక్ష్యం

ఏదేశంయొక్క స్వాతంత్ర్యసిద్ధియయినా ముఖ్యంగా ఆకలిబాధా విముక్తిని సాధించలేకపోయినచో అది వ్యర్థమే కాగలదు. మన ఉప రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్ చెప్పినట్లు మానవుడు ఒక్క ఆహారంతో మాత్రం జీవించలేదన్నది నిజమే అయినా అతని మనుగడకు అన్నిటికంటె ప్రధానమైనది ఆహారం. ఆహారం లేనిదే మానవుడు బ్రతుకుటకాని, తనకు సిద్ధించిన స్వాతంత్ర్యమును వినియోగించుకొనుటకుగాని అవకాశమంటూ లేదు. కాబట్టి ప్రతిదేశం ఆహారోత్పత్తిలో స్వయంపోషకత్వమునకు పాటుపడాలి! మన దేశంలో వ్యవసాయోత్పత్తులు పెంపొంది ఆహారము, పశుగ్రాసము పుష్కలంగా సమకూరుటకు పంచవర్ష ప్రణాళికల నిర్వహణలో ప్రజలు కృషిచేయాలి!

## బరువు బాధ్యతలు

ఏరాష్ట్ర ప్రజలైనా జాతీయ ఐక్యతపట్ల అశ్రద్ధచూపడం ప్రమాదభరితం కాగలదు. ఏరాష్ట్రానికారాష్ట్రము వ్యక్తిగత వాంఛలతో స్వార్థమునకు ప్రాధాన్యమునిస్తూ జాతీయ శాంతి భద్రతలకు ముప్పు వాటిల్లునట్లు వ్యవహరించుట అవాంఛనీయము. వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా తమ వాంఛితాలు న్యాయమైనవయినా దేశంలోని స్థితిగతులను దృష్టిలోనుంచుకొని జాతీయ అభివృద్ధి అభ్యుదయ కార్యక్రమాలకు, శాంతి భద్రతలకు అవరోధములేకుండా వాని సాధనకు కృషి, ఆందోళన సాగాలి! ప్రభుత్వము సయితము వాస్తవికతకు భిన్నముగా వ్యవహరించడమువలన ప్రజల ఆదరాభిమానములకు దూరముకావలసి వచ్చునని గుర్తించాలి.

పంజాబీ సుబా ఉద్యమంలో ఆమరణ ప్రాయోపవేశ దీక్షకు పూనుకున్న శ్రీ ఫతేసింగ్ దీక్షను విరమించుటలోను, ప్రభుత్వము ఆకలి సత్యాగ్రహులను విడుదలచేయుటలోను ఉభయులు సామరస్య సౌహార్ద్రములవైపు ముందంజ వేశారనే చెప్పాలి. ఈ సందర్భమున ఉభయులు అభినందనీయులు.

## విజ్ఞానశాస్త్రాభివృద్ధి – మానవ సౌభాగ్యం

విజ్ఞానశాస్త్రాభివృద్ధి నుద్దేశించి చేసే కృషి, పరిశోధనలు మానవ సుఖ సౌభాగ్యములకు తోడ్పడటం వాంఛనీయము. అంటే మానవుని తెలివితేటలు, శక్తి సామర్థ్యాలు, కృషి, తను, తనతోడివారు సుఖంగా, సౌభాగ్యవంతంగా ఉండుటకు వినియోగపరచ పూనుకుంటే విజ్ఞానశాస్త్రం మానవ సుఖ సౌభాగ్యాలకు తోడ్పడుతుంది.

## సంగీతము – వ్యాయామము

మద్రాసులో న్యాయ కళాశాల ఆంధ్ర సంఘమువారు శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారికి సన్మానము చేసిన సందర్భమున నాయుడుగారు శరీరానికి వ్యాయామమువలె మనసుకు సంగీతము అత్యవసరము అన్నారు.

మానవుని ఆయురారోగ్యాలకు వ్యాయామం ఎంతగానో తోడ్పడుతుంది. అంటే శరీర దార్ఢ్యమునకు, రోగము రొప్పి లేకుండా యుండుటకు, కళాకాంతులతో ఉత్సాహంగా నుండుటకు బలవర్ధకమైన ఆహారం మాత్రం చాలదు. ఆహారం వినియోగం క్రమబద్ధమై ఆరోగ్య సౌభాగ్యాలు పెంపొందడానికి శరీర వ్యాయామం తోడ్పడుతుంది. అలాగే మానసికంగా మానవుని కష్టాలను, దుఃఖాలను ఉపశమింపజేసి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందజేయడానికి, నిరాశ నిస్పృహలను పారద్రోలి ఉత్సాహపరచి ముందుకు నడపడానికి సంగీతము అమోఘంగా తోడ్పడుతుంది.

సంగీతము మానవజీవయాత్రపై అత్యంత ప్రభావము కలదగుటచే స్త్రీ పురుష భేదముల కతీతంగా సంగీత సాహిత్యాలు మరింతగా మానవశ్రేయస్సుకు వినియోగపడేలాగ అభివృద్ధిగాంచాలి. శరీరదార్ఢ్యం, ఆరోగ్యం ఎంత ముఖ్యమో మనశ్శాంతి, వికాసము, ఉత్సాహము, ఆధ్యాత్మిక, పారమార్థిక చింతనములు సంగీతముద్వారా అంత ముఖ్యము.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private). Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10  6 ఔ॥ రు. 5-50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బల హీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

## కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు, బెంగుళూరు